## ఇందులో వ్యాసాలు


పుణ్యం - పాపం
భయం
ద్వేషం - ఈర్ష్య
కామం
సెక్సు కంట్రోల్
హిందూ పతివ్రతలు
అన్యకాంత లఢ్డంబైన
ప్లేటోనిక్ లవ్
పత్రికలు చేసే అపచారం
కవిత్వం దేనికి?
సినీమా జ్వరం
బాధ
త్యాగం



# పుణ్యం - పాపం

లోకం కొన్ని కార్యాలు మంచివంటుంది, కొన్ని కార్యాలు చెడ్డవంటుంది. సత్యమూ, అహింసా, దానమూ ఇవన్నీ మంచివి. క్రూరత్వమూ, అబద్ధమూ, లోభమూ యివన్నీ చెడ్డవి. ఎందుకని ప్రశ్నిస్తే దేవుళ్ళనీ పూర్వ శాస్త్రాలనూ ఆధారంగా తీసుకొస్తుంది. దేవుళ్ళు యెప్పుడు చెప్పారో, ఆ శాస్త్రాలు ఎవరు రాశారో ఎవరూ చెప్పలేరు గనుక వాటి విషయమై వాదించలేం. వాటిని ప్రశ్నిస్తే ఒప్పుకోరు.

నూతన నీతిశాస్త్రరీత్యానూ, హేతురీత్యానూ విచారణ చేస్తే లోకం నెమ్మదిగా, సుఖంగా జరగడానికి ఏర్పడే పనులూ గుణాలూ మంచివనీ, విరుద్ధమైనవి చెడ్డవనీ అన్నట్టు కనిపిస్తుంది. కాని ఈ పుణ్యపాపాల విభాగం కొన్ని శతాబ్దాలకింద జరిగింది. ఆ నీతు లిప్పటివి కావు. ఈ యిన్ని శతాబ్దాలలోనూ లోకం చాలా మారింది. అప్పుడు ఆ పరిస్థితులలో లోక కళ్యాణానికి తోడ్పడే అన్ని పనులూ ఇప్పుడు పడడంలేదు. పూర్వం బావులు తవ్వించడం మహా పుణ్యమన్నారు. కుళాయీలు పెట్టిన వూళ్ళో బావులు తవ్వించడం పాపం కాకపోయినా, ఇబ్బంది కలగజేస్తుంది. కాని, ఇప్పటికి అక్కర్లేని బావులు, అనవసరపు సత్రాలూ కట్టించి స్వర్గానికి టిక్కట్టు కొనుక్కునేవారున్నారు. బ్రాహ్మలకు వేరే వృత్తులు లేని కాలంలో, భోజనం పెట్టడం పుణ్యమన్నారు. తోళ్ళ వ్యాపారంలోనే వేల కొలదీ సంపాయించే బ్రాహ్మడికి ఔపాసనం వడ్డించి, పెద్దల్ని వూర్ధ్వ లోకాలకి తరుముతున్నారు,

ఈ పురాతన ధర్మాల్ని నమ్మేవారు, ఈ మార్పు నంగీకరించరు. మనుష్యులమీదకన్న, రక్తమాంసాలమీదకన్న, వారికి తాటాకుల గ్రంథాల మీద భక్తి యెక్కువ. సంఘ మూర్ఖంచేత, మనుష్యులు నలిగి చస్తున్న కొద్దీ వారికి సంతోష మెక్కువ.

కాని వారుగూడా ధర్మాలని కాలానుగుణ్యంగా మార్చుకుంటూనే వున్నారు. హరిశ్చంద్రుడి సత్యాన్నీ, సీత పాతివ్రత్యాన్నీ అక్షరాలా అనుసరించే బుద్ధిహీనులులేరు. ఉన్నారా, వాళ్ళని జైళ్ళలోనూ, ఆసుపత్రులలోనూ, పెడుతున్నారు. భూతదయ అనే ఆదర్శం, ఒకళ్ళకి వంకాయల దగ్గిరా, ఇంకోళ్ళకి చేపల దగ్గిరా, ఇంకోళ్ళకి ఆవుల దగ్గిరా కొందరికి బంధువుల దగ్గిరా ఆగుతోంది. సత్యమనే ఆదర్శం కోర్టు గుమ్మాలదగ్గిర చెప్పుల్లో విడిచిపెడుతున్నారు. శాస్త్రాల్లో వున్నప్రకారం అనుభవించారా వారం రోజుల్లో లోకంలో ఒక్కరూ మిగలరు.

ఇప్పుడు లోకం ఎంత దుస్థితిలో వుందంటే—శాస్త్ర వచనాలని అంగీకరిస్తూ, వాటికి విరుద్ధంగా ప్రవర్తించడం ఒప్పుకుంటుందీ, వాటికి విరుద్ధంగా ప్రవర్తించకపోయినా, ఈ వచనాలు నాకు లక్ష్యం లేదంటే శిక్షిస్తుంది. స్త్రీ భర్త ఆస్తి అని ఒప్పుకుంటుందే ఏ అక్రమాలన్నా కళ్ళు మూసుకుని సహిస్తుంది. స్త్రీ స్వతంత్ర వ్యక్తి అనగానే లోకం కోపగిస్తుంది. నేను బ్రాహ్మణ్ణి అంటో, ఏ పనులు చేసినా ఒప్పుకుంటారు. నేను వర్ణభేదం అంగీకరించనంటే కులంలోంచి తరుముతారు.

బుద్ధిమంతులు స్వబుద్ధితో యోచిస్తారు. ఏవి ప్రస్తుతం లోకానికి క్షేమం కలుగజేస్తాయి, ప్రస్తుతం యే నీతులు కావాలి, ఏ కార్యాలు బాధాకరంగా వుంటాయని స్వబుద్ధిని పెట్టగానే ఒక్కొక్కరికి ఒక్కొక్క రీతిగా తోస్తుంది. శాస్త్రవాదులు శాస్త్రాల్లో చెప్పనివన్నీ ఘోరపాపా



లంటారు. స్వార్థపరులూ, అల్పమేధావులూ తమకి తాత్కాలికానందాన్ని యిచ్చే కార్యాలన్నీ లోకానికి ఉపకరిస్తాయని అనవచ్చునని చాలామందీ భయం.

కాని యీ తర్కం, యీ తిరుగుబాటు, యోచన చాలా సంస్కారం వుంటేనేగాని కలగదు. నీతి చట్టాలని ప్రశ్నిస్తే అధికారం కలగడానికి చాలా వివేకం వుండాలి. ఏ పాపాలు చెయ్యడానికి జంకనివాడు కూడా, న్యాయచట్టాలని ప్రశ్నించడు—న్యాయచట్టాలని తలుచుకోనివాళ్ళున్నారు. ఊరికే దొంగవాదనలు చేసేవాళ్ళున్నారు. తప్పించుకునేవాళ్ళున్నారు. వాటిని నిర్లక్ష్యం చేసేవాళ్ళున్నారు. కాని 'సీరియస్'గా వాటిని మార్చాలని చూసే వాళ్ళు ఎప్పుడూ నీతి చట్టాలని ధ్వంసం చెయ్యాలని చూడరు. ప్రతివాడూ తన విషయంలోనే యీ చట్టాలు వర్తించకూడ దంటాడు. కాని అందరి విషయంలో వర్తించకూడదనడు. ఇతరుల ఆస్తి, స్త్రీ తనకు కావా లంటాడు కాని తన ఆస్తినిగాని, స్త్రీనిగాని ఇతరులు తీసుకోడం ఒప్పుకోడు.

ఉన్న చట్టాలలో తనకేగాక అందరికీ మార్పు కావాలనేవాడు లోక కళ్యాణాన్నే కోరుతున్నాడు. ఎవరికీ ప్రయివేటు ఆస్తి వుండకూడదనేవాడు లోకాభివృద్ధినే వాంఛిస్తున్నవాడు, మరణశిక్ష, వివాహాలు, గర్భవిచ్ఛేదన శాసనము యివన్నీ రద్దు కావాలనేవాడు లోకకళ్యాణాన్నే కోరుతున్నాడు. అది 'ప్రాక్టికల్' కావచ్చు, కాకపోవచ్చు.

ఇవన్నీ ప్రజలందరూ అంగీకరించిందాకా, ఆగాలంటారు వివేకవంతులూ, పిరికివాళ్ళూ. నెత్తిమీద పులితో దోవతీసి లోపలికి ప్రవేశపెట్టిందాకా ఊహాలు యెక్కువు వాళ్ళకి. ఇంకా శాస్త్రవచనాలు అరుస్తూనే వుంటారు. వితంతు పుత్రికకు గర్భం కలిగిందాకా, కోడంత్రికం పడలేక

కూతురు లేచి వచ్చిందాకా, కొడుకు తురకకూడు తిన్నదాకా, మనమరాలు జడ కత్తిరించుకున్నదాకా ఆచారం ప్రబలుతూనే వుంటుంది. ఈ పనులు చేసినంత సంస్కారం, ఏ పుస్తకాలూ, ఉపన్యాసాలూ, కాన్ఫరెన్సులూ చెయ్యలేవు. కనక అట్లాంటి పనులు జరిగించే ప్రయత్నాలు గట్టిగా చెయ్యాలి ప్రజ్ఞావంతులు.

తమ స్వంత బుద్ధితో యోచించి, తోచింది ధైర్యంతో చెయ్యగల యువకులనూ మా పాత ప్రపంచపు ప్రజల హృదయాన్ని తహతహ లెత్తించగల యోధుల్నీ కోరుతూంది ప్రపంచం.



# భయం

ప్రస్తుతం లోకాన్ని దుర్గతిలో వుంచుతూవున్న కారణాలన్నిటిలోకీ ముఖ్యమైనది భయం. పక్కనున్న దేశాన్నిచూసి భయపడడం యుద్ధాలకు కారణం: పక్కనున్న మనుష్యుణ్ణి చూసి భయపడడం పోలీసులకు కారణం: ఏ అప్రతిష్ట వొస్తుందో అనే భయం భర్త క్రూరత్వానికీ భార్య దాసీత్వానికీ కారణం: భవిష్యత్తు ఎట్లా వుంటుందో అనే భయం, హితులకూ, పూజలకూ, జ్యోతిషాలకూ, శాంతులకూ కారణం: పరలోకంలో ఏమైపోతామో అనే భయం గుళ్ళకూ దేవుళ్ళకూ కారణం; మతమనే యినపకట్ల బిగింపు పిడికిలితో సంఘాన్ని చావమోదేది యీ భయమే. సోదర మానవుణ్ణి ఎక్కువ హింసించి నీతి భ్రష్టతలోకి తోసేవారే భగవంతుణ్ని ఎక్కువ ప్రార్థిస్తారు. ఆ దేవుడికి లంచాలుగా అనేకం కల్పిస్తారు. వడ్డీ పేరుతో తోటి మానవుడి యిళ్ళమ్మి దేవాలయాలు కట్టిస్తారు. పార్టీలను పిండిచేసి ఫీజులాగి పెళ్ళిళ్ళలో దక్షిణలిస్తారు.

ఎవరిని తమకన్న అధికంగా ప్రేమించమని శాస్త్రాలు శాసించాయో ఆ దేవుడిమీదా ఆ తోడి మానవులమీదనే ప్రజలకు అమితమైన భయం. దేవుడిమీది భయంచేత శాస్త్రాలు, ఆచారాలు, మతాలు, ఇవన్నిటిమీద భక్తి ఎక్కువై, సహజమైన జ్ఞానాన్ని చంపి, మత రాక్షసులుగా తయారవుతారు. దీనవాళ్ళ ఘోష, వితంతువుల విలాపం, పసిబిడ్డల యేడుపు యేమీ యీ పరలోకపరుల చెవులకు యెక్కవు.

దేవుడికన్నా భయం ప్రజల్ని చూస్తే, పొరుగువాడు తనని చూసి యేమనుకుంటాడో అనే భయం లోకాన్ని వూపిరి పట్టుగా బిగించి నొక్కి వుంచింది. పక్కవాడిమీద ద్వేషమే, వాణ్నిచూస్తే అసహ్యమే—వాడికి తనమీద గౌరవం లేదని తెలుసు—కాని వాడిముందు సహజంగా కనబడితే లోకువ అని భయం. ప్రపంచానికి సదభిప్రాయాన్ని కల్పించలేకపోతే బ్రతకలేమనే భయం ఎంత అబద్ధాలకోరులుగా చేస్తూవుందో! అబద్ధాలు చెప్పి అయినా సత్యవంతుడైనట్టు కనపడాలి. ఎవరి డబ్బు దోచినా దోచినట్టు కనబడకుండా ధనవంతుడై కనపడాలి. తాను చెరిచిన స్త్రీని ఎరగనని నట్టేటిలో వొదిలి తన నీతీ, గౌరవమూ నిలబెట్టుకోవాలి. తన సంపాదనా తన కాపరమూ, తన మోటారు, తన పలుకుబడీ అన్నీ యితరుల కోసమే. ఏ వస్తువునుంచీ, ఏ సౌందర్యంనుంచీ ఆనందం తీసుకునే శక్తి పోతూవుంది.

ఒక్కొక్కప్పుడు ఆలోచిస్తే, ఈ యితరులమీది భయంపోతే, నిజమైన ఆనందం యెంత కలుగుతుందా, ఎన్నిబాధలు ప్రజలకు పోతాయా అని. ఇంత భయపడి దొంగవేషాలు వేసి అనుమానాస్పదం కావడానికి నిజమైన కారణాలు యేమిటి? ఒక్కొక్కరిలో వుండే వికృత స్వభావాలకు ఒక్కొక్కప్పుడు వాళ్ళు ఎంతమాత్రము కారణం కాదు. ఆ రక్తం కారణం, ఆ తల్లిదండ్రులు, వారి సాహసం, వాళ్ళ జీవిత సందర్భాలు, సంఘం, పరిసరాలూ, ఆర్థికస్థితి యింకా యెన్నో వున్నాయి. నపుంసకుడు స్త్రీని వర్జించి జీవించడం నీతిజ్ఞతవల్ల అని నటించవచ్చు. కాని, కాదు. వాడు మనసులో యెప్పుడూ అవినీతిగానే బతుకుతూ వుండవొచ్చు. ఎక్కువ పుంస్త్వం గలవాడు కొంత విచ్చలవిడికావడం అవినీతితోకాదు. వాడు యెప్పుడూ పరాఙ్ముఖత కోసం యత్నిస్తూ వుండవచ్చును. సత్యాన్ని ఆదరించే ఆరోగ్యమైన బలమైన సంఘంలో, నీతి అవినీతి అనే కృత్రి



మత తీసివేసి అందరూ సహజంగా వుంటే యీ దొంగవేషాలూ కల్మషాలూ వుండవు. తమ ప్రకృతి యెలా వుంటే అలాగే కనపడడం తప్పుకాదనే సదభిప్రాయం వొచ్చిననాడు యెంత ధర్మం యెక్కువౌతుందో యీ లోకంలో!

జ్వరంవొస్తే, కనపడ్డ ప్రతివాడితోనూ జ్వరం వొచ్చిందని చెప్పుకుంటాడు; ఈర్ష్యతోగాని, లోభత్వంతో గాని బాధపడుతూ వుంటే అవి లేనట్టు దాచేందుకు యెన్ని వంకర్లో తిప్పి బాధపడతాడు. ఎప్పటికి ఈ భయాలుపోయి ఈ కృత్రిమ జీవనంలోంచి బైటపడి సహజంగా, నిజమైన సౌఖ్యాన్ని నిజమైన బాధల్ని అనుభవించగలుగుతామో!



# ద్వేషం - ఈర్ష్య

భయం తరవాత యీ లోకంలోని కల్మషానికి క్రూరత్వానికీ ముఖ్యకారణం ద్వేషం. ద్వేషం ప్రేమకు చాలా సన్నిహితం. అందుకనే మనం ప్రేమిస్తున్న వాళ్ళు అపరాధం చేసినప్పుడు మనకి యెక్కువ ద్వేషం కలుగుతుంది. అన్నదమ్ముల వైరాలూ, తండ్రీ కొడుకుల విరోధాలూ చాల కఠోరాలవడాని కదే కారణం. తనని ప్రేమించినంత సేపూ ప్రియురాలికి ప్రాణం యివ్వడానికి సందేహించనివాడు, ఆమె తనని ప్రేమించడం మానిందా ప్రాణం తియ్యడానికి వెనుతియ్యడు.

ఈ ద్వేషానికి ముఖ్య కారణం యీర్ష్య. తనకు లేనిదీ, తను కావాలని కోరేదీ, యితరులు కలిగివుంటే వారిని ద్వేషించడం సహజమయింది. చక్రవర్తికి రాజ్యమున్నదని సామాన్య వర్తకుడు యీర్ష్యపడడు. పక్కనున్న వర్తకుడు మేడకట్టిస్తే బాధపడతాడు. అట్లానే పసిపిల్లవాడూ వృద్ధుడూ యువ్వనుడి ఆనందాన్ని చూసి యీర్ష్యపడరు.

ఈర్ష్యకి ముఖ్యకారణం తృప్తిపడని వాంఛ. తమ జీవితంలో ఆనందం తక్కువగా వుండడం, భోజనం చేసినవాడు, భోజనం చేసినవాణ్ణి చూచి యీర్ష్యపడడు. ఆకలి కలవాడికే ఈర్ష్య. కాని కొందరు తమకి అన్ని సౌఖ్యాలువున్నా, తమకు లేనివీ, యితరులకి వున్నవీ చూసి బాధపడడం అలవాటు చేసుకుని జీవితమంతా యీర్ష్యలతో గడుపుతారు. తమకు లేదని దుఃఖంకన్న యితరులకు ఉన్నదనే బాధ మరీ యెక్కువవుతుంది.



ఈర్ష్యకు అసంతృప్తి కారణమని మనుష్యులు తమ మనసుల్లో తామే వొప్పుకోరు. అట్లాంటి ఈర్ష్య కలవారమని తమని తామనుకుంటే, తమమీద తమకే అసహ్యం కలుగుతుంది. అది మానవ హృదయం సహించదు. ఇంకొకరికన్న తాము తక్కువ అనుకొని బతకలేరు ప్రజలు. కనక ఆ యెక్కువ వారిలో యెట్లానన్నా లోపాలు ఏరాలని చూస్తారు. ధనవంతుల జీవితంలో బాధలున్నాయని నమ్మడానికి దీనవాళ్ళ ప్రయత్నం, మర్యాదస్తుల యిళ్ళల్లో నీచకార్యాలు జరుగుతున్నాయని తెలుసుకోడానికి ప్రజలపాట్లు, ప్రేమగల భార్యలు దొంగలని రుజువు చెయ్యడానికి పరాయి మొగవాళ్ళ పడేపాట్లు, క్లబ్బులో "స్కాండల్సు" మాట్లాడ్డం, యితరులు చెడ్డవారని వింటే కలిగే సంతోషం, మంచివారని వింటే బాధ, వీటన్నిటికీ యీర్ష్యే కారణం.

ద్వేషానికి యీర్ష్య కారణమని కూడా ప్రజలు వొప్పుకోరు. ఒకరి ధనాన్నిగాని, రూపాన్నిగాని చూసి ద్వేషిస్తున్నావంటే నమ్మడు. ఎందుకు? అది నీచంగా కనబడుతుంది. కనక ఈర్ష్య కలగగానే ఆ మనిషిని ద్వేషించడానికి కారణాలు వెతుకుతారు. అప్పుడు వారికి తమ ద్వేషం న్యాయంగా కనబడుతుంది. న్యాయమేకాదు. ధర్మమని, శుభప్రదమనీ తోస్తుంది. అందుకనే యీ ద్వేషం సాధారణంగా సంఘ క్షేమం కోసమనీ, నీతి కోసమనీ, పైకి మాట్లాడ్డం సంభవిస్తుంది. కోడళ్ళు తమ కొడుకుల ప్రేమను లాగారని అత్తలకి యీర్ష్య. ఈర్ష్యవల్ల ద్వేషం. ఆ ద్వేషాన్ని సమర్థించడానికి కోడలిలో తప్పులు వెతకి, తమ ద్వేషం న్యాయమని సమర్థించుకుంటారు. ఎదురుతిరిగి తిట్టే కోడలికన్న, అన్నిటిట్లూ తినే కోడల్ని చూస్తే చాలా కోపం ఎందుకు? ద్వేషాన్ని ప్రసరింప చేసుకోడం సమర్థించుకోడం చాల బాధాకరం అప్పుడు. అట్లానే సంఘంలో వుండి, సంఘం వొద్దనే పనులు

చేస్తో కూడా వాళ్ళతో తగూలాడుతో, లెంపలు వాయించుకొంటో వుండే వాణ్ణి సంఘం క్షమించి ప్రేమిస్తుంది. సంఘ బహిష్కారాన్ని లక్ష్యం చెయ్యక, దొంగ పశ్చాత్తాపాలు పడక, తానుచేసే పని క్రమమనిగాని అక్రమమైనా చేసి తీరతాననే వ్యక్తిని సంఘమంతా కలిసి ద్వేషిస్తుంది. ఇంటో ఎంత రంకు చేసినా సంఘం కళ్ళు మూసుకుంటుంది. ఒక్కణ్ణి మనసారా ప్రేమించి స్త్రీ గుమ్మం దాటిందా, సంఘం నరికేస్తుంది. చెడ్డ పేరు వస్తుందంటే భయపడని వాణ్ణి సంఘం ఒక్క నిమిషం భరించలేదు.

ఈర్ష్యపడనివాడు ద్వేషించడు. ఇతరులు చెడిపోతున్నారంటే, జాలి పడతాడుగాని, ద్వేషించడు. ద్వేషించేవాడు—పైకి రెండోవాడు చెడిపోతున్నాడు అంటున్నా, లోపలమాత్రం వాడివలె చెడిపోవాలని తనూ వాంఛిస్తో వుంటాడు. సుఖంగా స్త్రీలోలుడైనవాణ్ణి, అందరూ తిడతారు. కాని తమకా భాగ్యం లేకపోయిందని యీర్ష్యపడతారు. ఇందుకనే వాడిమీద వున్నవీ లేనివీ స్కాండల్సు మాట్లాడతారు. వెక్కిరిస్తారు, అరుస్తారు. నిజంగా చెడిపోతున్నాడనే నమ్మితే విచారపడి, నెమ్మదిగా చెప్పిచూసి వూరుకోవాలి. మరీ వినకపోతే వాడి ఖర్మమని వొదిలివెయ్యాలి. పైపెచ్చు తమ ద్వేషానికి ధర్మబలాన్ని కలగచెయ్యడానికి సంఘం పాడవుతుందనీ, సంఘం నాశనమవుతుందనీ, దొంగ ఆదుర్దాలు పడతారు. ఈ ద్వేషించడంలో తప్ప యితర విషయాల్లో సంఘంజోలి వీరికి పట్టదు.

అందుకనే పూర్వాచారపరులు చెడిపోయే వాళ్ళను చూసి యెక్కువ ద్వేషించరు. వారి ఆచారం జోలికి పోకపోతే యెవరెట్లా పోయినా వాళ్ళను బాధించరు. ఇంత ఈర్ష్యే లేకపోతే లోకంలో యే వ్యక్తి స్వాతంత్ర్యం ఆ వ్యక్తికి యివ్వడానికి ప్రజలు సంకోచించరు. తాము బంధనాలు వొదిలించుకొని సుఖపడలేరు. పడేవాళ్ళను చూసి సహించలేరు. తాగుబోతు వాళ్ళను



చూసి జాలిపడతాం. తాగుబోతు గుణముండి, తాగే ధైర్యం లేనివాడే ద్వేషించి, సంఘం పాడవుతోందని అరుస్తాడు, వితంతు వివాహానికి ముఖ్య ఆటంకం స్త్రీలు—వితంతువుకి యిద్దరు భర్తలనీ, తమకి ఒక్కడే నని యీర్ష్య.

ఈ ద్వేషించేవారికి ధైర్యం తక్కువ, ఆశ లెక్కువ. ఏది కావాలనుకుంటారో, దాన్ని పొందే శక్తి సాహసాలు లేవు. అందుకని దానిని అనుభవించే వాళ్ళకి కష్టాలు కలగచేసి తృప్తి పడాలని చూస్తారు పాపం. దేనికోసం ద్వేషిస్తున్నారో, దాన్నే దొంగతనంగా అనుకరిస్తారు. అందంగా బట్టలు వేసుకొన్న స్త్రీని ఆ ధైర్యంలేని స్త్రీ ద్వేషిస్తుంది. క్రమంగా భర్తా, పొరుగున వున్న పుల్లమ్మా వొప్పుకున్నంత వరకు తానూ మారాలని చూస్తుంది. వ్యభిచారం చేస్తున్నారో అని బిగ్గరగా అరిచేవాడు ఎప్పుడూ కూడా తాను రహస్యంగా, కక్కుర్తిగా ఆ పని చేస్తూనే వుంటాడు. లేకపోతే అసమర్థుడై, తృప్తిలేక, ఆ ప్రయత్నం మీదనే వుంటాడు మొత్తానికి. మొత్తానికి తృప్తిపడని వాంఛే ఈ పెద్ద నీతి వుపన్యాసాలకి ముఖ్యకారణం. ఈ ద్వేషం తీర్చుకోవాలనే వాంఛ యెంతో బలం కలది. అందుకనే మర్యాద గల మనుష్యుల్ని, పత్రికల్ని, నీచమైన మాటల్లోకి, రాతల్లోకి దింపుతుంది.

లోకంలో యింత దరిద్రమూ, అసంతృప్తి లేకపోతే, యింత ద్వేషం వుండదు, జీవితంలో 'డిజప్పాయింటుమెంట్సు' ఎక్కువగా పడ్డ వాళ్ళకి ఈర్ష్యలు ఎక్కువ: ద్వేషాలు అమితం.

ఇట్లా అసంతృప్తిని అణచిపెట్టి వంకర్లు తిప్పడం వల్ల కలిగే యీ దుర్గుణాల్ని, కప్పిపెట్ట చూస్తారు ప్రజలు. జాగ్రదవస్థలో దాచిపెట్టగలరు. కాని తాగినప్పుడు, కలవరించేప్పుడు, సంధిలో, పిచ్చిలో, చాలా వుద్రేకంలో నిజమైన మనుష్యులు బైటపడతారు. కళ్ళెం వొదులవుతుంది.

ఈ ద్వేషంవల్ల యింకో లాభం వుంది ద్వేషించేవారికి. ద్వేషించే దాన్నే వాళ్ళు లోపల వాంఛిస్తున్నారు కనక, ద్వేషిస్తున్నాననే పేరుతో, ఆ సంగతే మాట్లాడుతో ఆ సంగతే రాస్తోపుంటే, పుండును గోకినట్టు కొంత వుపశమనం కలుగుతుంది. సహజంగా తీర్చుకోని వాంఛ, నాలుక లతో తీర్చుకుంటారు, రోడ్డుమీద పోయే స్త్రీలను తిట్టడానికి యిదే కారణం. ఇతరుల ప్రవర్తననించి కళ్ళు తిప్పేసి, తమకివున్న ఆనందాలు చూసు కుని తృప్తిపడడం నేర్చుకుంటేనేగాని, హృదయాన్ని కాల్చే యీ ద్వేషం నశించదు.

ద్వేషం అసహజం తనకీ బాధ, యితర్లకి బాధ. ఏ ఆనందంమీద తమకి వాంఛవుందో, ఆ ఆనందాన్నుంచి పొందడానికి ప్రయత్నించి పొందితే యీ దారుణ వేదనలోంచి బైటపడతారు. లేకపోతే యేదో ఒక రూపాన యీ ద్వేషం బాధపెడుతోనే వుంటుంది.



# కామం

ఆకలీ కామమూ రెండూ యీ ప్రపంచంలోని జీవుల్ని ప్రోత్స హించే శక్తులలో ముఖ్యమైన సూత్రాలు. ఒకటి జీవింపచేసేదీ, రెండోది అభివృద్ధి చేసేదీ. సృష్టి యీ రెండు పునాదులమీదనే నిలిచి వుండడంచాత, వీటిని అతిక్రమించడమూ, అణచిపట్టడమూ, అమిత కష్టసాధ్యమైన పనులు. జీవిత చర్యలోని సమస్త ఆలోచనలూ, పనులూ, వాటి 'మోటి వ్‌జ్' కదపటి 'ఎనాలిసిస్'లో యీ రెండు శక్తుల వల్లనే ప్రోత్సహింప బడినట్టు తేలుతుంది. ఈ శక్తుల్ని అణిచిపెట్టినా అవి ఏదో వొక గూఢ రూపాన మనుష్యల్లో పని చేస్తోనే వుంటాయి. ఈ రెంటికీ గొప్ప పోలికా వుంది: చాలా భేదమూ వుంది. మృగాలలో ఇవి పుత్త 'ఇన్‌స్టిన్‌క్ట్'గానే వున్నాయి. కాని మనుష్యులలో వీటికి వివేకమూ, జ్ఞానమూ, శిక్షణా కావ లసి వొస్తున్నాయి. 'ఇన్‌స్టన్‌క్ట్'కే వొదిలితే, మృగాలవలెనే మనుష్యుడు పచ్చికాయల్నీ ధాన్యాలనీ మృగాలనీ, పీక్కు-తింటాడు. కామం కలిగినప్పుడు యెదుటనున్న ఆమెతో బాధ తీర్చుకుంటాడు. కాని వంటా, రుచులూ, జీర్ణమూ, వీటిజ్ఞానం అవసరమైనట్టే, మాంసాహార నిషేధమూ, రుచుల నతిక్రమించడమూ, లంఖణమూ యీ నిషేధాలు బైలు దేరినట్టే. స్వకీయ పరకీయ కామప్రవృత్తులూ అత్తరూ, చీరెలూ, వివాహ సంబంధ నిషేధాలూ, మందులూ, బంధాలు అవసరమైనాయి.

ఒక గొప్ప భేదం వుంది. తినబడేదానికి ఆనందంలేదు. కాని కామంలో పరస్పరానందముంది. జీవించేదాన్ని వధించి తినకండా జీవించ

లేని సూత్రం సృష్టిలోనే వుంది గనక, కరుణామయుడైనవాడు, ఎంత తక్కువ వధచేసి బతకడానికి సాధ్యమౌతుందో యోచిస్తాడు: అట్లానే ఇతరులకి బాధ కలగకుండా ఎంత ఆనందాన్నిచ్చి, తాను తన కామాన్ని వినియోగపరుచుకోగలనా అని యోచిస్తాడు.

ఆకలినీ కామాన్నీ అణుచుకోడం దుష్కరమని తెలిసినా, సుఖంగా సునాయాసంగా భోజనమూ, స్త్రీ లభించే వారికి, ఆ అదృష్టం లేనివారెంత బాధపడతారో అర్థంకాదు. పైగా ఆకలినీ, కామాన్నీ అణుచుకోడం పుణ్యమనీ, ఆరోగ్యకరమనీ, ప్రచారం చేశారు. లభించినవారికి అనుభవించడమూ పుణ్యమూ, లభించని వారికి వైరాగ్యం పుణ్యమూ ఇట్లాంటి బోధన లేకపోతే పుణ్యాత్ములు సృష్టించుకున్న సంఘం నిలవదు. ఇతరుల ధనానికీ, భార్యలకీ ఆశిస్తారు దురదృష్టవంతులు.

క్రమేపీ, కొందరు మాత్రమే భోజనసామగ్రినీ స్త్రీలనూ దాచుకుని, అతి కాపీనంతో, అమితంగా అనుభవించడం వల్లనూ, తమ ఆహ్లాదంకోసం అనేక మార్పులు చేసుకోవడంవల్లనూ, యీ సహజమైన వాంఛలు అనారోగ్యవంతములైనాయి. ఈ కారణాన్ని కనిపెట్టక, కనిపెట్టే తెలివీ, ధైర్యమూ లేక, భోజన విషయంలో నేమురలిస్టులు బైలుదేరి యీ వంటలూ, కారాలూ, మాని స్వభావసిద్ధమైన పచ్చికూరలకీ గింజలకీ మళ్ళమని బోధిస్తున్నారు. అట్లా బోధించే వారిని అనుకరించేవారు లేకపోయినా, గౌరవించే వారనేకులున్నారు. ఆ విధంగానే కామవాంఛ కూడా యీ పెళ్ళిళ్ళవల్లా, విడాకులవల్లా, వితంతువులవల్లా, కన్యలవల్లా, అత్తర్లవల్లా, సిగ్గూ, దౌర్జన్యమూ, భోగంవాళ్ళూ, యోగులూ, వీటి అన్నిటివల్లా అసహజమై అనారోగ్యమైందనీ, స్వభావసిద్ధంగా సృష్టిలో ఎట్లా వుందో దాన్ని అనుకరించుకుంటే, అనుకరించేవారూ వుండరు. ఆ ఐడియాని గౌరవించేవారూ వుండరు. అంతేకాదు. పాకశాస్త్రం రాసినవాడు, ప్రపంచానికి మంచివాడే…



కామాన్ని రాసినవాడు జగద్విరోధి. కాని కామశాస్త్రిలు మాత్రం రాత్రి పదకొండింటికి ప్రతివారూ పరువుల సందుల్నించి పైకితీస్తారు. దొంగ చిరునామాలతో తెప్పించి దాచుకుంటారు, తాళాలున్న పెట్టెల్లో.

కొందరికి ఆకలి యెక్కువా, కొందరికి తక్కువా వున్నట్టే, కొందరికి కామం ఎక్కువ కొందరికి తక్కువ. వొడ్డించేటప్పుడు "మనిషినిచూసి వొడ్డించు" అనడం చాల న్యాయమైన పని అంటారు. దీనినే కామం విషయమై వుపయోగిస్తే ఆకాశం విరిగి పడుతుంది. 'తిండి పుష్టిగలవాడు' అంటే గౌరవం, కామపుష్టిగలవాడు అంటే రౌడీ. చివరికి కామం ఎంత తక్కువగా వుంటే, వాడు అంత మర్యాదస్తుడూ, నీతిపరుడూ, పవిత్రుడూ ప్రస్తుత ప్రపంచంలో.

ఈ అభిప్రాయం భోజన విషయంలో కూడా కొంతవరకు అనువర్తించింది. ఎవరి యింటోవారు దిట్టంగా తినవొచ్చును కాని, పరాయి యిళ్ళలో ఎక్కువగా తినకూడదు. తనకు సహించనట్టు, ఆమూలా యీమూలా కొంచెం కెలికి పోయేవాడు, మర్యాదస్తుడు నాజూకుడు, శుభ్రంగా పూర్ణుకు తిని, యింకా అడిగేవాడు సత్రపు భుక్కు. దరిద్రుడు ఎందుకు? తమ సొమ్ము తినేవాడుగనుక! భోజనం పెట్టిన కీర్తి దక్కాలి, ద్రవ్యమూ ఖర్చుకాకూడదు. ఈ భోజనంతోనూ, కామంతోనూ, ప్రమేయం లేకుండా వెండిబిళ్ళలతోనూ, నోటు కాయితాలతోనూ ఆడుకునే మర్యాదస్తులైన ప్లీడర్లు, వుద్యోగస్తులు, డాక్టర్లూ వీరందరూ సంఘపు ముద్దుబిడ్డలు. వీరికి కావలసినవల్లా లాంకోట్లు, మోటార్లూ, నగలూ, అత్తర్లూ. వాస్తవానందాన్నిచ్చే భోజనంతోనూ, స్త్రీలతోనూ ఎక్కువపనిలేదు: వున్నా ఏమీపనిలేనట్టే నటించగలరు. ఏదో రహస్యంగా, నాజూకుగా, మర్యాదగా, యితరులకి యిబ్బందిలేకుండా వ్యవహరిస్తారు. కాని అతి ఆకలీ, కామంగల సాధారణ మానవులు సంఘ విరోధులు, రౌడీలు, దుర్మార్గులూ ఎందుకు? వీరి ఆకలీ,

కామమూ ఆగవు. తెమ్మనీ, ఇవ్వకపోతే లాక్కుంటామనీ సంఘాన్ని బెదిరిస్తోవుంటారు. ఈ మర్యాదస్తులూ, సంఘ పునాదకులూ, నీతి విరాట్టులూ అధికారవంతులూ తమకి అక్కర్లేకపోయినా తమకి ఎక్కువైనా, కాపీనంతో దాచుకునే భోజనాన్నీ స్త్రీలనూ, సామాన్య ప్రజలు తమకు పంచమంటారు మర్యాదస్తులకు వాటిని సంపాదించుకోవడం తెలుసు. వాటిని దాచుకోవడం తెలుసు పోలీసుల సహాయంతో. ఈ దుర్మార్గులకు వాటిని సాధించడమూ, అనుభవించడమూ తెలుసుకనక పరస్పరవైరం. తెలివిగలవారూ, విద్వాంసులూ గనుక యీ మర్యాదస్తులు, యీ దాచుకోడాలకి, ఆస్తీ, హక్కు, వారసత్వమూ, నీతి,పుణ్యమూ,ప్రాతివ్రత్యమూ, సంస్కారమూ, శీలమూ, ఇట్లాంటి పేర్లుపెట్టి, తమస్వార్థాన్ని రక్షించుకోవాలనీ, ఈ దుర్మార్గుల్ని కూడా ఈ అర్థంలేని పేర్ల మహిమతో,మాటలయంత్రంతో, నమ్మించాలనీ ప్రయత్నిస్తారు. ఇట్లా ఆటంకాలు లేకపోతే తమని రక్షించగలవారిని తన్నేసి, తమని అనుభవించగలవారి దగ్గిరికే యీ వాస్తువులు చేరుకుంటాయని తెలుసు నిశ్చయంగా, యీ భాగ్యవంతులకి.

పశువుల్లోని కామం మనుష్యుల్లో అప్పుడప్పుడు మోహంగా మారి, చాలా క్షోభలను, పశువుల్లోలేని కొత్త 'ప్రాబ్లెమ్సు'ను తెచ్చిపెట్టింది. సంఘ నిర్మాతలు మనుష్యుల్ని పశువులవలె వుత్తకామంగల జంతువుగా పరిగణించారు, మోహం అనే ఆకర్షణవల్ల పాలింపబడే జీవుల్నిగా మనుష్యుల్ని, ముఖ్యంగా స్త్రీలను, భావించినట్లయితే, శరీర మనోస్వేచ్ఛ లేశమాత్రమూ లేని ఈ వివాహ సంస్థ ఎన్నడూ అమలులోకి వొచ్చేదికాదు. ఐతే చాలామంది స్త్రీ పురుషులు పశు సంప్రదాయాన్ననుసరించి, ఆ స్టేజ్‌లోనే వుండడంవల్లనే యింకా వివాహ పద్ధతి సంఘంలో నిలిచి వుంది. అందువల్లనే సంఘాన్ని తికమకలుపెట్టే యీ మోహ ప్రేమల్నిచూస్తే నీతి



వంతులకు అమితమైనకోపం. కవిత్వంతో వాటి వర్ణనల్ని వొప్పుకుని ఆనందిస్తారుగాని, జీవితంలో కఠినంగా ఖండిస్తారు.

ఈ మోహం, స్త్రీ పురుష ఆకర్షణా, అనేవి లేకుండా వుంటే యీ ప్రపంచం ఎంత బావుంటుంది? అని ఆశపడతారు. ఈ రసికత్వమూ, ఆనందమూ, బాధా, విరహమూ లేకుండా లోకమంతా, సమంగా ఒక భర్తా ఒక భార్యా, వారిద్దరికి మాత్రమే పరస్పర బంధమూ,ఆమె వండడానికీ పిల్లల్ని పెంచడానికీ, ఆయన వాళ్ళని కాపాడ్డానికీ సంపాయించడానికీ,అట్లా వుంటే భూతల స్వర్గంకాదా అని కలలు కంటారు అనేకులు. రొమాన్సు కవిత్వం, మోహం, ఇల్లాంటివి కావాలంటే, ఆ భార్యా భర్తలు ఒకరిపైన ఒకరు చూపుకోవచ్చు నంటారు.

కాని అదృష్టవశాత్తూ, ప్రపంచం అంత నరకంగా లేదు. ఇంకా దుర్మార్గులూ, పాపాత్ములూ, రసికతా, సౌందర్యభావం, అర్థంకాని ఆశా, అంతులేని పిపాసా మిగిలాయి ప్రపంచంలో. నీతివంతుల ఆజ్ఞానుసారం లోకం నడవకుండా వుండడంచేతనే యింత ఆకర్షకంగా, ఇంటరెస్టింగ్‌గా వుంది. ఈ నీతివంతుల శాసనాలు చూసి నవ్వేందుకన్నా ఈశ్వరుడు వున్నాడేమో అనిపిస్తుంది.

మోహం గిట్టని మనుష్యులు యీ దుర్మార్గ ప్రపంచాన్ని చూసి భరించలేక కళ్ళు మూసుకుంటారు. తాము ఈ పాపపులోకంలో బతకడమే ఒక వరంలాగు, ఈ పాపాత్ముల వూపిరిగాలి పీలవడమే గొప్ప త్యాగమైనట్టు నటిస్తారు. కాని ఏం లాభం? పాపం! ఎక్కడ చూసినా, ఏ మూల కళ్ళు వాలినా, మోహమే, కామమే, పాపమే—పువ్వులు పువ్వుల్ని పిలుస్తున్నాయి గర్భం చెయ్యమని—దూర్లల్లో పిచ్చికలు,వీధుల్లో కుక్కలు, గడ్డిలో కీటకాలు, చెరువుల్లో బాతులు-కళ్ళు మూసుకుంటారు. కాని వాళ్ళ అంతర్

దృష్టికి, వాళ్ళ ఆత్మల్లోని కామమే కనబడుతుంది. ఇంక చేసేదిలేక, అశక్తతవల్ల నటన ప్రారంభిస్తారు. ఆ ప్రేమా, విరహమూ, తుచ్ఛ మానవుల్లోనూ, చదవరాని కథల్లోనూ, చూడరాని ఫిల్ముల్లోనూ, వుంటాయనీ, వాటికీ అసలు పురాణాల్లోని ప్రేమకీ భేదం వుందనీ, ఒకటి భౌతికమూ, రెండోది ఆధ్యాత్మికమనీ, కళ్ళు తేలేసి 'ప్రపంచం ఎంత పాడైపోయిందోనని' చప్పరించి, రామకృష్ణ నామ స్మరణకు ప్రారంభిస్తారు-రామకృష్ణులు రసికాగ్రేసరులని మరిచి! ఇట్లాంటి పవిత్రవంతుల్ని చూస్తే జాలిపుడుతుంది. వాళ్ళ మోసమూ, అంధత్వమూ, క్షుద్రత్వమూ, దాపలా ఏడుపులూ - ఎవరి మనసునైనా కరిగిస్తాయి.

వీళ్లుకాక, ఈమధ్య ఇంకోరకపు తమాషా రకపు మనుషులు బైలుదేరారు. చాలావరకు వాళ్ల కొత్తమార్గపు కవులూ, వారి శిష్యులూ; సంసార కథకులూ. వీళ్ళందరికీ సామాన్య లక్షణాలు ప్రేమకవిత్వం, రహస్య వ్యభిచారం, బహిరంగ దుర్నీతి ఖండన.

వీళ్ళ కావ్యాలూ, ఖండకావ్యాలూ, సగం కొరికిన పద్యపాదాలూ ప్రేయసులకి సంబోధిస్తారు. అంకితాలూ యిస్తారు స్త్రీలకి. వాళ్ళని సోదరీ మణులు అంటారు. సొంత అక్కచెల్లెళ్ళకి యిచ్చిన వాళ్ళెవరూ లేరు. గట్టిగా వాదిస్తే, తమ భార్యలకే నంటారు ఆ సంబోధన. భార్యలు లేని వాళ్ళూ, చచ్చిపోయిన భార్యల పరంగా కవిత్వధోరణికి దిగినవారూ తాము మళ్ళీ పెళ్ళిచేసుకోవా లనుకున్నామనీ, ఈ పద్యాలు తాము కామించిన వితంతూ రత్నానికనీ సూచిస్తారు. భార్యలు బతికివున్నవాళ్ళూ - రెండోసారికూడా చంటిపిల్లల్ని కట్టుకున్నవాళ్ళూ - ఆ పద్యాలు దేవతలకీ సంధ్యారాగాలకీ-వెన్నెల కన్యలకీ—అని దంబాలు పోతారు. అదీ తప్పితే, తమ ప్రేమ పవిత్రమని వాదిస్తారు. ప్రేమ ఎప్పుడు పవిత్రమో - ఎప్పుడు



అపవిత్రమో సరిగా తెలీనిరు. కొందరు ప్లేటోనిక్ లవ్ విశ్వాసులు ముఖ్యంగా పళ్ళూ, కళ్ళూ లేనివాళ్ళు.

వీరి నాయికలకి సరైన అవయవాలు వుండవు. తిండి వేరు. మాటలు ఏదో భాష. రక్తం చాలా తక్కువ. దేవీ, తల్లీ, రాజ్ఞీ, ఈశ్వరీ, సోదరీ, అని సంబోధనలు ఎక్కువ. కవికీ, ఆమెకీ హృదయం తప్ప తక్కిన శరీరం ఊడిపోయినట్టు కనిపిస్తుంది.

వీళ్ళ రహస్య చరిత్రలనూ. వీరి దత్తి పోకిళ్ళనూ, భయాలనూ, నీచపు కోర్కెలనూ, మిత్రులతో సంభాషణలను, వీరు సోదరీమణులను గురించి మాట్లాడే బూతులను వారి పరిచయులందరికీ చెప్పనక్కర్లేదు.

ఇంక దుర్నీతిని ఖండిస్తారు. సుఖంగా అనుభవించే వారిని చూసి వీరు పడే ఈర్ష్యని నీతి పేరుపెట్టి ముక్కా నోటా ద్వేషం కక్కుతారు. తమని సమర్థించుకోడానికి సంస్కృత కావ్యాలనీ, ఇంగ్లీషు పాతవయస్సునీ, కళా సూత్రాలనీ లాక్కొస్తారు. ప్రస్తుతం తెలుగు సారస్వతం ఈ కీర్తి పురుషుల అధీనంలో వెలుగుతోంది.

తక్కిన జీవులకన్న మనుష్యుడు ఎట్లా అధికుడంటే, సృష్టిని అర్థం చేసుకునేందుకు, సృష్టిలోని బాధల్ని తప్పించుకొని సృష్టికి మించిన సౌందర్యాలనూ ఆనందాలనూ కల్పించుకునేందుకు, అతని తెలివిని వుపయోగపరుచుకున్నాడు. మనుష్యుడు అనుభవించే దారుణ వేదనలను గాని అప్రమేయానందాల్నిగాని పశువులు ఎరగవు. పాప పుణ్య భయాలవల్లనూ, జడత్వ భీరుత్వాలవల్లనూ, సాధారణ ప్రజాభిప్రాయ మన్ననలవల్లనూ, మోసపోయి జీవితం ఇవ్వగల గాఢానుభవాన్ని చవిచూడ జంకే మనిషి పశుసమానుడు. పాపం కనపడుతుందని కళ్ళు పొడుచుకున్నవాడు. రుచుల్ని కోరుతోందని నాలుక కోసుకున్నవాడు ఎంత వివేకవంతుడో, ఈ మోహ

కర్ణణను మూసుకున్నవాడు కూడా అంతే వివేకవంతుడు. గుర్రానికివలె కళ్ళకు గంతలు కట్టుకుని, ఋజుమార్గమే చూడాలని, ప్రకృతి సౌందర్యాలకు అంధుడైన వాడు, స్వర్గ సౌందర్యాలను మాత్రం చూసి సంతోషించగలడా? ఈ ఆధ్యాత్మికానందాలను గుర్తైనా పట్టగలడా ?

మృగం శక్తులన్నీ, పనులన్నీ దాని జీవితావసరాలకి ఉపయోగపడడంతోనే సమయిస్తాయి. కాని మనిషికి జీవితానికి అవసరంకన్న ఎక్కువైన శక్తులూ, అతని వ్యాపారాలకి స్వేచ్ఛనీ, ఆనందాన్నీ కలిగించగల మనోభావాలూ వున్నాయి. జ్ఞానతృష్ణ. సౌందర్య పిపాస. శాస్త్రోపాసన, వేదాంత జిజ్ఞాస, కళాభిరుచి—ఇన్ని వున్నాయి అతని లోపల కాచుకుని, మనిషి అభివృద్ధి చెందినకొద్దీ పరిణామం చెందినకొద్దీ ఇవి ఎక్కువగా వ్యక్తమౌతాయి.

ముఖ్యంగా అతనిలో అతనికి అవసరం లేనంత, వెల్లువలై ప్రవహించే భావోద్రేకం వుంది. అదే అతనిలో కళా నిర్మాణానికి మూలం, కారణం. కనక మనుష్యుడు తన సంస్కారాన్ని పట్టి ప్రతి పనిలోనూ, చివరికి ఆలోచనలలో, ఊహాకల్పనల్లోకూడా కళనీ సౌందర్యాన్నీ కల్పించుకుంటాడు.

మొగ మృగం ఆడమృగాన్ని చూసినప్పుడు, ఆ ఋతువులో తప్ప తక్కినప్పుడు దానికి ఏ భావోద్రేకమూ వుండదు. ఆ ఋతువులో కూడా ఆ భావోద్రేకం, సృష్టికార్యం సఫలమయేందుకు ఎంత కావాలో అంతే కలుగుతుంది. వాటిల్లో కూడా, కుక్కలు కరుచుకోడాలూ, నెమళ్ళు, పాములూ ఆడడాలూ, పిట్టలు పులకరించడాలూ, కూతలూ, ఇవన్నీ భావోద్రేకాన్ని తెలియచేస్తాయి. చాలామంది మనుషులు స్త్రీలతో కూడినప్పుడు ఈ మాత్రపు వుద్రేకాన్ని కూడా చూపరు.



అతని భావాలు, దుఃఖం, ఈర్ష్య, ఆనందం, క్రోధం ఇవన్నీ కళారూపాన వ్యక్తమైన గొప్ప ఆర్టుని సృజించాయి-పద్యాలు, పాటలు, కథలు, విగ్రహాలు, చిత్రాలు, వీటి అన్నిటికన్నా గొప్పగా, గొప్పవారిలో, జీవితాన్ని దినచర్యలో, లైఫ్ ఈజ్ ఆర్ట్ అనేదానికింద మారుస్తాయి.

పిల్లల్ని సృజించే కార్యంలో మనుష్యుడికి కలిగే భావోద్రేకం ఇతర విషయాల్లో ఎక్కడా కలగదు, ఎక్కడో ఒకరికి భక్తిలో తప్ప. కనక ఆ కార్యానికి భావమైన కామాన్ని, మోహంకింద, ప్రేమకింద మార్చి కళావాతావరణం కల్పించి—ఎక్కడా, ఏ విషయంలోనూ లేని, కవిత్వాన్ని, రసికత్వాన్ని, చాతుర్యాన్ని సృష్టించుకున్నాడు.

సంసారాల్లో ప్రస్తుతం, కళా వాతావరణం పూర్తిగా నశించింది. వివాహం సంస్కారం కావడం, స్వేచ్ఛ లేకపోవడం, మామూలై పాత పడడం, ఆర్థిక దుస్థితి, స్త్రీకి ఆర్థిక బానిసత్వం ఇవి కొన్ని కారణాలు. వివాహాన్ని సంస్కారం, ధర్మ విధ్యుక్తం చేసిన పూర్వీకులు, ఈ కళా విజృంభణని తీర్చడానికి, సఫలత చెయ్యడానికి కళారాధకులైన వేశ్యల్ని సంఘంలో భాగంగా స్థాపించారు. వేశ్యలు నీచపశువులంటా, దేవుళ్ళకి అంకితమిచ్చారు వాళ్ళని. వేశ్యలూ, బ్రాహ్మలమల్లేనే, తమ హృదయాల్ని, ఆత్మల్ని నాశనం చేసుకుని, ధనంమీద ఆశ మరిగినందువల్లనూ, క్రమంగా శృంగారమూ సృష్టి కార్యమూ బూతుగా పరిగణింపబడడంవల్లనూ, ఆ కులం నాశనమై ఆకర్షరహితమై, పురుషుల జీవితంలో ఒక గొప్ప భాగమైన మోహోద్రేకానికి ఆధారం తీసేసింది. అందువల్ల ఇప్పుడు ఇతర స్త్రీలని కోరడం ఎక్కువైపోయింది. కొద్ది మార్పులతో భేదాలతో ఈ సంగతులు, స్త్రీలకి వర్తిస్తాయి. ఇదివరకంటా, చాలావరకు ఇప్పటికీ కళా సౌందర్యానికి నిలయం స్త్రీ, అనుభవించేది పురుషుడూ కావడంచేత ఈ భేదాలు కలగడానికి ఆస్కారమయింది. స్త్రీలో యీ కళాభిరుచిని పోగొట్టుకుని,

పురుషుడు ఆమెని వుత్త కామయంత్రం చేసుకోడం వల్ల, యీ అనర్థాలు ప్రాప్తించాయి.

ఏ నీతి నియమంవల్లనో, అశక్తతవల్లనో, భయంవల్లనో పురుషుడు సంసార బంధితుడై, కామాన్ని మామూలుకార్యంలో వినియోగించి, తృప్తిపడడానికి ప్రయత్నించడంవల్ల, గొప్ప ఆనందాన్ని, సౌందర్యాన్ని, సంతృప్తిని పోగొట్టుకుంటున్నాడు. తనతోబాటు స్త్రీనికూడా వుత్త బికారిని చేశాడు. అర్థంలేని శుష్కనీతి డాంబికమే మిగిలింది. తక్కినవారికి దొంగతనమూ, భయమూ, పాపభీతీ. మిగిలాయి.

ఈ ప్రపంచం యివ్వగల సుఖాలన్నిటిలోనూ స్త్రీ పురుషాకర్షణే అతీతమయిందని శాస్త్రాలే ఘోషిస్తున్నాయి. జీవితంలోని జడత్వాన్ని కదిలించి, సర్వశక్తుల్నీ ప్రేరేపించి క్రొత్త అగ్నిలో తపన పొందించి, తదితర ప్రపంచ తృణప్రాయంగా కనబడేట్టు చేసి. ధర్మాలు వొదిలించి, భీభత్స, నీచ, శౌర్య, పాప, సాహసకార్యాలకు సంసిద్ధుణ్నిగా చెయ్యగలిగిన మహా మోహాకర్షణను అనుభవించని మనిషి పిపీలికకన్నా అధముడు, జడుడు, పాషాణుడు. ఎట్లాఅయితే, యోగి, అధ్యాత్మికానందం అనుభవించవలసిందే కాని, తాను చెప్పడానికి చాతకాదంటాడో, అట్లానే యీ రసికానందం, సర్వమూ అర్పించి, ఆ అగ్నిలో భస్మమైతేనేగాని, అర్థంకాదు. సాధారణ సంయోగంవల్ల కలిగే నరాల శమనం పశువులు కూడా యెరుగును. కాని శరీర మనోవృత్తులలో భావంలో, సౌందర్యంలో మిళితమై, జ్ఞానంతో, నేర్పుతో, భక్తితో, కళాగ్రహణంతో, పొందేటటువంటి అప్రమేయ అనిర్వచనీయ సౌఖ్యం సాధారణ మానవు లెరగరు. పరస్పర పూజ్యభావంతో లోపరహిత మోహంతో, కోరి ప్రయత్నించి, విజృంభించి, పొందే పరస్పరైక్య సంభాసంలో కొందరే నివసించడానికి అర్హులు. నీతి కర్తల నాశించ అటువంటి భూతల స్వర్గానుభవాన్ని నీచమనీ, క్షుద్రమనీ, తోసివేసే



వారికన్న మూర్ఖులుండరు. నరాలబాధ తీర్చుకోడమే వీరి ఉద్దేశ్యంలో ప్రేమ. అంతకన్న వున్నత దృష్టిలేదు, పాపం!

ఈ లోకం దుఃఖసాగరమనీ, ప్రజలను ముక్తినించి దూరం చేసేందుకూ, వారిమనోస్థైర్యాన్ని పరీక్షించేందుకూ ఏర్పరచిన వలలూ, బోనులూ యీ సుఖాలనీ, బాధలకూ విచారాలకూ యీశ్వర కృపకూ గొప్ప సంబంధమున్నదని ఆనందపడేవారందరూ పాపాత్ములనీ, పంచేంద్రియాలూ పంచశత్రువులనీ బోధించిన వేదాంతుల వల్లనే యీ దురభిప్రాయాలు బైలుదేరాయి. ఆనందాల్లోకల్లా ఉన్నతమైన యీ మోహానందాన్ని అన్నిటికన్న యెక్కువగా ఖండించారు. ముఖ్యంగా స్త్రీలు ముక్తినుంచి కిందికిలాగే రాక్షసులున్నారు. ఎందుకంటే స్వర్గంకూడా పురుషుల హక్కే గనక. ఏ స్త్రీ విశ్వామిత్రులకన్నా పురుష మేనక లున్నారా మరి!

ప్రేమదేవి, సుందరమూర్తి, భీషణమూర్తి, లభించదు. సాహసంలేని నీతిపరులకు, సందేహించే స్వార్థపరులకు, బలమూ, జ్ఞానమూ, ఆరోగ్యమూ, ఆత్మ మర్యాద, ధనమూ సర్వమూ సంశయంలేకుండా అర్పించి ఆరాధిస్తేనేగాని, ఆమె సాక్షాత్కరించదు. ప్రాణాల్ని బలికోరుతుంది. కాలుస్తుంది. పిచ్చెక్కిస్తుంది. సర్వసహజ బంధనాల్నీ తెంచి, హృదయ రక్తంవోడ్చి బైరాగిని చేస్తుంది. దుమ్ములోపొల్లి ఏడ్చేవాణ్ణి భప్పున వొళ్ళోకెత్తుకుని, వోదార్చి, మహదానందడోలికల్లో వూపుతుంది. ఆమెకంటి మృదుదృష్టులుచాలు, ఈ బాధకి అంతా అర్థమివ్వడానికి: ఆమె వొళ్ళోగడిపినవి నాలుగు ఘడియలేకాని ఏ బుద్ధి చాపల్యమో, ఏజాడ్యమో, మరణమో, కారణంగా విరహజ్వాలలో మళ్ళీ కాలిస్తేనేం? ఆ నాలుగు ఘడియల ఆనందం చాలు. లక్ష జన్మల నరకంకూడా ఆ మాధుర్యాన్ని తుడిచివేయలేదు, కలిగిన ఆ అనుభవ ఔన్నత్యంవల్ల ఆత్మపొందిన వికాసాన్ని ఏ వేదనా నశింపచేసి వెనక్కి లాగలేదు.

ప్రపంచంలో అనేక విధాలైన ఆనందాలున్నాయి. ధనం, కీర్తి, సంసారం, పిల్లలు, వుద్యోగం, అధికారం, పోటీ, జయం, సాహసత్వం. కాని యివన్నీ కలిపి అనుభవించినా, ప్రేమామృతంలో ఒక్క బిందువుకి సరిరావు. అద్వితీయమైన వాస్తవ ప్రేమామృతం దొరికిందా, యింక ధనాధికార కీర్తి కామ్యాలు ఏమీ అవసరం కావు. సూర్యుడిముందు నిప్పురవ్వల వలె. ఈ ప్రపంచమే మాయం కానీ, ఆ యిద్దరూ డిస్టర్బ్ కాకండా ఓమూల వుండగల స్థలం దొరికితేచాలు: యోగికి దర్భాసనంవలె. సమస్తమూ మరిపించి, తక్కిన వాంఛల్ని అన్నిటినీ భస్మం చెయ్యగలిగితేనేగాని ఆ ప్రేమ ఉన్నతమైన ప్రేమకాదు. ఈ సాధారణ ప్రజలందరూ, కాము అనుభవించే వెర్రి పలుకుల్నీ, దొంగ చూపుల్నీ, దినకామచర్యనీ, పంటినీ అధికారాల్నీ ప్రేమే ననుకుని తృప్తి పొందుతో వుంటారు.

'ఈ ప్రేమకన్న అధికమైనది ఆధ్యాత్మికానందం వున్నది. దానికై ప్రయత్నించాలి' అంటారు భర్తలూ, యోగులూ, క్షుద్రులూ, వికలాత్ములూ ఉన్నట్లే కనబడుతుంది. ప్రయత్నించడం న్యాయంగానే వుంది. కాని, ఆ ఆనందం కలిగిందాకా, చేతికి చిక్కిన యీ ప్రేమనుపొందితేనేం? అదీకాక ఆధ్యాత్మికానందం నిజమైన ఆనందమే ఐతే ఇంక ఏ ఆనందంతోనూ దానికి విరోధం వుండకూడదు. భోజనంలో పొందే సుఖానికీ, ఉద్యోగ సౌఖ్యానికీ, పరస్పర విరోధం వుందా? ఆనందాలతో హెచ్చు తగ్గులుంటాయి గాని, ఆనందానికీ ఆనందానికీ విరోధమనడం, కాంతికీ కాంతికీ విరోధమన్నట్టుంటుంది. కాని స్త్రీ పురుష స్పర్శలతో భంగమై నశిస్తుంది అంటారు ఆ ఆత్మానందం. ఆధ్యాత్మికమని లెక్చర్లుకొట్టి ప్రేమారాధకుల్ని పశువులని పిలిచే వీరెవరికీ నిజమైన ఉన్నత అనుభవం లేనేలేదు. ఆత్మానందం దాగదు. ముఖంలో, మాటలలో, జీవితంలో వ్యక్తమవుతోనే ఉంటుంది. ప్రేమవల్ల పవిత్రమైన జీవితంగల వ్యక్తి ముఖమే గొప్ప



తేజస్సుతో నాట్యమాడుతో వుంటుందిగదా, యీ ప్రపంచ జీవితానందంతో ఐక్యమైన ఆత్మ ఎంత వికాసాన్ని కలిగివుండాలి! అంత ఉన్నతానందాన్ని పొందే మనుష్యులు యీ అల్ప నైతిక ఖండనలతోనూ, యీర్ష్యలతోనూ, స్కాండల్సుతోనూ కాలం గడుపుతారా? సర్వజీవిత విధాలనూ ఆలింగనం చేసుకుని, వాల్యూజ్ ఇచ్చే ఉదారత్వాన్ని సంపాయించరా? ముక్కులు, కళ్ళు మూసుకుని పాపమని మూర్ఖులు, ఎప్పుడూ పాపాలు చేస్తో, దొంగ చూపులు చూసే నవీన ఋషులు, వేదాంతం మాట్లాడి, భూమిపైనా ఆకాశంపైనా అని తర్కించే అద్వైతులు, వీళ్ళందరూ రహస్య వ్యభిచారాన్నే గాని, మధురమూ నిర్భయమైన ప్రేమ నెరుగరు. వారికి శరీరానందమూ లేదు, ఆత్మానందమూ లేదు. కుళ్ళి యేడ్చే యీర్ష్యానందం తప్ప; ప్రేమికులను బహిష్కరించి, నిందించి, ఖండించి సంతుష్టిపడే వెగటు ఆనందం తప్ప-ముఖ్యం వీరికి విస్తరి దగ్గిర ఆనందం ఒకటే కనపడుతుంది. చివరికి పువ్వుల్ని, నీళ్ళను, పసిపిల్లల్ని ఇతర జీవుల్ని చూసికూడా ఆనందపడని జడులు, అంధులు, యీ నీతి ప్రచారకులు. వీరు కామాన్ని యెరగరు, ప్రేమనూ ఎరగరు, ఆనందాన్నీ యెరగరు. ఒక్క నీతినే యెరుగుదురు. ఆనందమయుడూ, సుందరమయుడూ, మంగళమయుడూ, ప్రేమమయుడూ అంటారు కదా ఈశ్వరుడు! ఆనందాన్నీ, ప్రేమనూ గుర్తింపక ఖండించి, దిగనాడుకొనే వీరు ఈశ్వరుణ్ణి యెట్లా గుర్తించగలరు?



# సెక్స్ కంట్రోల్

మృగాన్ని వొక్కదాన్ని 'జూ'లో బంధించారు. స్త్రీ మృగ సంపర్కంలేదు. ఎన్నేళ్ళు బంధనలో వున్నా, అందువల్ల ఆత్మాభివృద్ధి కలుగుతుందా? అతీతమైన బాధ కలుగుతోందనీ, అదీ జాడ్యంగా మారవొచ్చనీ, అ మృగాన్ని చూసి ఆనందించే ప్రజాసామాన్యానికి తప్ప తక్కినవారికి తెలుసు. మనుష్యుడికీ, మృగానికీ, శరీరంలోనూ అవయవాల పనులలోనూ, ఇన్‌స్టింక్ట్సులోనూ ఎక్కువ భేదంలేదు. అయితే మనుష్యుడికి యింద్రియాల్ని నిగ్రహించే శక్తిగల బుద్ధివుంది. ఇచ్ఛాపూర్వకమైన నిగ్రహంవల్ల ఆత్మాభివృద్ధి కలుగుతుంది అంటారు. కాని ఆ నిగ్రహానికి అవసరమూ వుద్దేశ్యమూ వుండాలి — ఆ వుద్దేశ్యాలు ఆత్మాభివృద్ధికరమైనవి కావాలి. ఒకడు గోంగూర పచ్చడి మానేశాడు తినడం. కొందరు భోజనమే మాని పులవలు తింటున్నారు. వాళ్ళలో ఏమీ ఆధ్యాత్మికాభివృద్ధి కలగడం కనిపించలేదు. బీదవాళ్ళందరూ లడ్డు తినడంలేదు. అభివృద్ధి చెందుతున్నారా?

ఏదో ప్రయత్నం పెట్టుకుని దానికి ఆటంకమైనప్పుడే యీ యింద్రియ నిగ్రహం చేస్తే వుపయోగం గాని, వూరికే ప్రతి సుఖమూ వొదులుకోవడంవల్ల ప్రత్యేకంగా ఘనత ఏమీలేదు—లోకాన్ని భ్రమింపచెయ్యడంతప్ప.

అట్లానే సెక్సుసుఖం కూడా యే ఆధ్యాత్మికమో, సైంటిఫిక్ లేక ఆర్టిస్టిక్ మొదలైన నెసిసిటీ వల్ల, అవసర మధికమై, నిగ్రహించినప్పుడే



అర్థం వుంటేగాని, కానప్పుడు అర్థవిహీనమూ, వినాశహేతువూ అవుతూ వుంది. ఏమంటారంటే, వీర్యము రక్తంలోనే నిలచిపోవడంవల్ల అది అనేక అంతశ్శక్తులకి వినియోగపడుతుందని, ఫిజియలాజికల్ ఎక్స్‌ప్లనేషన్ కూడా యిస్తారు.

మృగాలలో అట్లా వినియోగపడ్డట్టు కనిపించదు. మనుష్యులకికూడా నిగ్రహం యవ్వనంలో ఏమీ వుపయోగపడదు. తమాషా కలలు కలిగించడానికి రెస్ట్‌లెస్‌గా చెయ్యడానికీ వుపయోగపడుతోంది— ఇంకా ఎక్కువ దుర్గుణాలకి కారణం కాకపోతే చాలు! ఇంతకీ సంసారులకి భార్యల్ని ఏడిపించడానికి వుపయోగపడుతుంది. శరీరంలో అధికంగా నిలవవున్న మూత్ర మేమవుతుంది, బిగబట్టితే! కొంత మళ్ళీ నెత్తురులో కలిపి జాడ్యం కలిగిస్తుంది. తక్కింది యెట్లాగో ఓలాగు బైటపడుతుంది. ఈ వీర్యమూ అంతే. ఐతే ఎవరైతే తమ విల్‌పవర్ వల్లగాని గొప్ప ఎమోషన్ వల్లగాని ఐడియల్ వల్లగాని ఆవేశింపబడి సాధనచేస్తో వుంటారో, వారిలో ఈ వీర్యశక్తి, రక్తంలో కలిసి తోడ్పడుతుంది అంటారు. నిజం కావొచ్చు. అట్లాంటివారికి వివాహం సంభోగం అక్కర్లేదు. కాని అట్లాంటివాళ్ళు ఎందరు ఏ దేశంలోగాని? ఏ గొప్ప ప్రయత్నంవల్లనో జ్వలించే వారిలో యీ వీర్యంకూడా ఆ జ్యోతిలో భస్మమై, మహాశక్తుల్ని వుద్భవింప చెయ్యవచ్చు. స్త్రీ దొరక్క బాధపడేవాడికి కూడా, యీ వీర్యనిర్బంధం వల్ల అద్భుత మహిమలు పుట్టుకొస్తాయా? లోకంలో ఏ పదిమందికో సాధ్యమయే యీ సాధనని, మన దేశంలో ప్రతి మూర్ఖుడికి సాధ్యం కావాలని బోధిస్తున్నారు యిప్పుడు.

నవనాగరికం పొందుతున్న సంసారాల్లో, స్త్రీలు రెండు రకాలు ఇష్టంలేనిదీ, అమితమైనదీ ఐన సంసారసుఖాన్ని భర్తల దగ్గిర్నుంచి పొందేవారు. దీంట్లో వేశ్యలు కూడా చేరతారు. ఆ బలవంతంవల్ల, నరాలు

మా అందరికీ తల్లి అవతరించింది. అయ్యగారికి నయం కావడం ప్రారంభమయిందో లేదో ఆమె పూర్వం వున్నట్టే వున్నారు." నిజమే ఆమె అరుపులు తగ్గడంతోనే, ఆయన జబ్బుకూడా తగ్గుతోంది- ఆ రహస్య కార్యంవల్ల. ఆమె, నా మిత్రుడు, పిల్లలు, నౌకర్లు, భర్త, అందరికీ వుపకారం కలిగింది. ఇక అపకారమల్లా యిది చదివి యేడ్చేవాళ్ళకి.

పూర్వకాలం నుంచి, ప్రతి దేశంలో, ప్రతి మతంలోనూ కూడా యీ స్త్రీ పురుష సంబంధాన్ని అసహ్యమూ, పాపమూ, నీచమూననీ ఖండించారు. సర్వసాధారణమూ, లోకానికి ముఖ్యావసరమూ, అతి ఆనందదాయకమూ ఐన యీ కార్యంమీద శాస్త్రవేత్తలు యెందుకిట్లా కత్తి కట్టారో? ముఖ్యంగా మిడివల్ క్రిస్టియానిటీ మరీ భయంకరంగా ఖండించింది యీ వాంఛని. ఆ ఘాటునించి, మూఢత్వంనించి యిప్పుడే మేలుకుంటున్నారు ఆ దేశస్థులు. మన దేశంలో పురాతన హిందూమతంలో స్త్రీనీ, స్త్రీవాంఛనీ యేమాత్రమూ నీచంగా చూడలేదు. ఈ అద్వైతమతమూ, గోచీలు బిగించి, బూడిదలు పూసుకోవడమూ, వీటితో ప్రారంభించాయి- యీ స్త్రీ వైరాగ్య బోధనలూ, యీ స్త్రీ దూషణలూనూ. పైపెచ్చు క్రిస్టియానిటీతో, మిషనరీలతో, టాల్‌స్టాయిద్వారా, బ్రహ్మ సమాజం ద్వారా కొత్త క్రోధాలూ ఖండనలూ బైలుదేరాయి. పురాతన హిందూమతంలో సన్యాసుల్ని శాసించారుగాని, సంసారుల మూతులు బిగగట్టడానికి ఎన్నడూ ప్రయత్నం చెయ్యలేదు, ఆరోగ్య సూత్రాలు విధించారు అంతే.

సర్వ సాధారణమూ, లోకకల్యాణానికీ, స్థితికీ ముఖ్యావసరమూ, అతి ఆనందదాయకమూ ఐన ఈ కార్యంమీద నీతిశాస్త్రవేత్తలు యెందుకిట్లా కత్తి కట్టారా అని యోచిస్తే— ఈ రసికులంత సంఘదౌర్జన్య కారకులు ఎవరూ కాకపోవడంవల్ల నేమో! సంఘ క్షేమంకోసం యీ ఇన్‌స్టింక్ట్‌ని అ కట్టవలసి వొచ్చింది. అది చాలా కష్టంగా కనపడ్డది. అందువల్ల చాలా



కఠినంగా నిందించారు ఆ కార్యాన్ని-అని తోస్తుంది యుగాల్నించి రక్తములో కలిసి పెరిగిన ఆ దోషమనే అభిప్రాయం వొదలదు. బుద్ధి రీజన్‌కి లొంగదు—ముఖ్యంగా నీతి పరులకి.

కాని నిష్పక్షపాత బుద్ధితో, యీ సెక్సు అవసరం ఆలోచిస్తే- (నీతి సూత్రాలని అవతలపెట్టి) జీవితంలో యీ సెక్సుకి స్థానమేదా అని పరీక్షిస్తే—

1. సరే సృష్టి తన అవసరంకోసం వినియోగించుకుంటోంది యీ పనిని.

2. చాలా బలంగల కోర్కె జీవుల్ని ప్రోత్సహిస్తుంది. నిగ్రహం కన్న మరణమే నయమనిపిస్తుంది చాలసార్లు.

3. ఇంకే విధానా అందుకోలేని మహదానందాన్నిస్తుంది.

నిగ్రహంవల్ల ఏదో యిదివరకు యెరగని గొప్ప ఆనందం లభిస్తుంది అంటారే, అంతకన్న గొప్ప ఆనందాన్నిస్తుంది, సంయోగం. ఆ కార్యంవల్ల కలిగే ఆనందం వివేకాన్ని, సంస్కారాన్ని ఎవల్యూషన్‌ని పట్టి వాటిపైనా ఆధారపడి వుంటుంది. ప్రస్తుతం ప్రజలు మృగాలుపొందే సుఖాన్ని కూడా పొందటంలేదు. పాజిటివ్ సుఖంకంటె నెగటివ్‌గా బాధని పోగొట్టుకోడమే ప్రధానమవుతోంది. సరే, యింక భార్యాభర్తల మధ్య మరీ అన్యాయం. అనేక మామూలు కాలకృత్యాలవలె ధర్మసంస్కారం. సుఖమూలేదు, చాలా బాధ, అసహ్యమూ ఏహ్యమూ, తద్దినంలో పాచిన కాళ్ళు కడగడం తంతు.

కనక యీ సృష్టికార్యంలో సుఖమూ, ఆనందమూ, ఎక్సైట్మెంట్ పొందాలంటే, వ్యభిచారమనేది అవసరమౌతోంది. కోరి, ప్రయత్నించి, ప్రయాసపడి, త్యాగంచేసి సంపాయించిన వారికే రొమాన్స్, బ్యూటీ సౌఖ్యం. అంత కన్న, రొమాంటిక్ ఆర్టిస్టిక్ టెంపర్‌మెంట్ వున్నవారు,

ఒకరి నొకరు వారినే ప్రత్యేకంగా ప్రేమించుకుంటున్న వాళ్ళు, సెక్సు ఇంపల్సుని అతిజాగ్రత్తగా, విలువగా పూజించేవారు, వుత్త శరీరాకర్షణే గాక, తమ బుద్ధికల్పించగల ఊహలతో, హృదయోద్రేకమిచ్చే అద్భుతాకర్షణచే, దివ్యలోకాన్ని సంయోగంలోనే అనుభవించగలరు. సంయోగాన్ని నీచమని ఖండించి, నీచమని బోధించడంకాదు కావలసింది. అది మహా మంత్రం అనీ, మనుషుల్ని దేవత్వాని కెత్తగల సాధనం, అది వొకటే ననీ, దానిని దుర్వినియోగం, సాధారణం, నీచం, మామూలు ఆచారం, చేసుకోవద్దనీ బోధించాలి. బిడ్డపుట్టగానే స్నేహం మానమనడం కన్న, అమితమైన ప్రేమ, అసాధారణమైన ఆకర్షణ వున్నప్పుడు తప్ప, యితర స్థలాలలో, సమయాల్లో, ఆ పని మహా పాపమని చాటాలి ప్రజలకి.

ఎవరన్నాసరే, సెక్సుని తిట్టినా, లోకువ చేసినా రొమాన్సు గొప్పతనాన్ని వెక్కిరించినా, సెక్సుని సార్డిడ్, నీచమూ, పాపమూ అన్నా, ఈ సంయోగంకన్న ఎక్కువ ఆనందాలున్నాయని వాదించినా, నిశ్చయంగా చెప్పవొచ్చు- అతను భీరువూ, దొంగా; లేకపోతే. అతనికి రతికార్యంవల్ల పురుషులకు వొచ్చే సుఖాన్ని పొందడం కూడా చాతకాని చవట-దద్దమ్మ. ఈ సంబంధంకన్న ఆనందమిచ్చేది మీకు ఏముంది అని అడిగితే, దేవుడూ ధర్మం, కీర్తి, డబ్బు మొదలైనవి చెపుతారు. దేవుడూ ధర్మం, వుత్తమాటలే కాని, ఎవరూ వాటికోసం ఏ ప్రయత్నమూ చెయ్యరు. కీర్తీ, డబ్బూతో సౌఖ్యపడే ప్రజలు ఎండమావుల్ని ప్రేమిస్తున్నారు.

పురాతన హిందూమతం ఆధ్యాత్మిక మార్గాల్లో, ఈ సంయోగాన్ని ఒకమార్గంగా తీసుకుంది. తద్వారా స్పిరిట్యువెల్ హైట్సుని సాధించడానికి ప్రయత్నించారు. ఆ కార్యాన్ని ఒక ఆర్ట్, ఒక స్పిరిట్యువెల్‌గా చేసి భోకంలోకల్లా శరీరంతో సాధించగలిగిన ఆనందాల్లోకి వున్నతమయింది



యీ ఆనందమే. ఈశ్వరుడంటే అప్రమేయానందం. కనక ఈశ్వర సాన్నిధ్యాన్ని చేరేందుకు ఇదొక సులభమార్గం' అన్నారు.

దీనికి నాకు అథారిటీస్ వున్నాయి.

మనుష్యుడు మృగాలకన్న వివేకవంతుడైనందుకు మృగాల ఆనందాన్ని త్యజించడానికి కాదు ఆ వివేకాన్ని వుపయోగించవలసింది. ఆపిటైట్సునే, కోర్కెల్నే స్పిరిట్యులైజ్ చేసుకోవాలి. ఆధ్యాత్మిక ప్రపంచమనేది వుంటే, అది భౌతిక ప్రపంచానికి విరోధమైనదికాదు. ఈ ప్రపంచానికి అతీతమయింది ఈ అనుభవాలకి హైయర్ కన్టిన్యుయేషన్స్ ఆ అనుభవాలు. తన ఆత్మ విస్తీర్ణానికి, ప్రతి కోర్కెనీ వుపయోగపరుచుకోవాలి. ఈ సెక్సుకోర్కె కూడా అంతే.

ఈ కోర్కెలోని నీచత్వమంతా, దానిని అణుచుకోమని బోధించే వాళ్ళ మనసుల్లో వుంది. వారి జీవితాల్లోగాని, చాలా విచారకరమూ, అసహ్యకరమైన అనుభవాలను చూసి. వివాహ సంబంధం బరువైనప్పుడు, సంకుచితమైనప్పుడు, అనారోగ్యకరమైనప్పుడు, పురాతన పూర్వజన్మ వాసనలను అతిక్రమించలేక బానిసలై 'ఏమీ ఆనందంలేదు' అని బోధిస్తారు. ఇంపాసిబుల్ వైఫ్ వుంది అనుకోండి — ఎంత ప్రయత్నించీ ఆ విరిగిపోయిన వీణలోంచి ఏం గానం సృష్టించగలడు? ఇతరమైన మార్గానఅనుభవించేందుకు నైతిక ఆటంకాలున్నాయి. అనుభవం స్వల్పం, సంకుచితం. అందువల్ల అసలు సంభోగం త్యజించినప్పుడు ఆత్మ చాలా ఆరోగ్యాన్ని పొందినట్టు తోస్తుంది. దాన్నిపట్టి అందరూ తమవంటి దురదృష్టవంతులే అనుకుని ఆ నీచత్వం ఆ కార్యంలోనే వుందనుకొని ప్రతివారికీ ఆ అనుభవాన్నే బోధిస్తారు, ఇతరులు అనుభవిస్తున్నారనే ఈర్ష్యవల్ల.

గొప్ప ఆత్మానుభవాన్ని పొంది, ఆ ఆనందంముందు స్త్రీనించివొచ్చే ఆనందం అల్పమనడం అర్థమవుతుంది, నాకు. కాని ఇప్పుడు స్త్రీనిత్యజించమని అననే అక్కర్లేదు. ఆటోమాటిక్‌గా డ్రాప్ అవుతుంది ఆ ప్రయత్నం. అప్పుడుకూడా తమ పార్టనర్‌కోసం ఈ ఫంక్షన్ ఫుల్ఫిల్ చేస్తోనే వుండవొచ్చు. చెయ్యమనే అంటోంది వేదాంతం. అట్లా పర్ఫెక్ట్ అయినవారు సంసారులకి ఈ కార్యం అక్రమమని బోధించరు, బోధించలేదు హిందూ శాస్త్రాలలో.

ఈ నీతిపరులు ఏదో ఒక సమయంలో, పరకీయంగా ప్రవర్తించినా, ఎంతసేపూ అంతరాత్మ బాధిస్తూ వుండడంవల్ల, అక్కడ విచారంగానే తిట్టుకుంటో వర్తించి, అనుభవాన్ని విషం చేసుకుని ఒచ్చి ప్రజలకి విరక్తి గీతాల్ని పాడతారు.

శృంగారాన్ని బూతు అనీ, ప్రేమని వ్యభిచారమనీ, సారస్వతంలో ఏదో మేహాల్లో ప్రేమతప్ప, దేహ వాంఛలు చిత్రించకూడదనీ, తిడుతో, అపవాదులు రేపుతో, మడి కట్టుకున్నట్లు మాట్లాడే వాళ్ళంత నీచులు ఇంక లేరు, నిశ్చయం. అందరానిదాన్ని తిట్టే నక్కలు, జెలసీతో కుళ్ళిన పురుగులు, జీవితంలో మురికి కూపాలు కెలికే కుమ్మరి పురుగులు.

మాటలు మాత్రం, ఏమాత్రమూ స్వానుభవంలో లేని, కళలూ, మనోభిరుచులూ.

మిత్రుడు డాక్టర్ తారనాథ్‌గారు, ఒకసారి ఏమన్నారంటే—

ఈ సంయోగం ఒక్క కామతృప్తికే కాదు, మనుష్యులు ఎవాల్వ్ అయినకొద్దీ, నర్వస్ టెన్షన్ తీర్చేందుకు గొప్ప అవసరమైన సాధనమన్నారు. అదీ నిజమే. ఆ కార్యం తరవాత కలిగే శాంతీ, సంతుష్టి, కృతజ్ఞతాభావం తలుచుకోండి—మీకు కలగవేమో మరి, పాపం!

ఈ స్త్రీ పురుష సంబంధం, (చివరకి వివాహం కూడా) సంతానానికే గాక, ప్రేమపన్నమని అంగీకరించరు. ఇదీ ప్రేమ అంటేయేమిటో స్వాను



భవం వల్ల గాని, యౌవన వల్లగాని తెలీకపోవడం వల్ల వొచ్చిన అనర్థం. సాధారణ ప్రజలు ప్రేమ అంటే యెరక్కుండానే, సంసారం సాగించగలరు. పిల్లల్ని కనగలరు, కాని కొంతమంది ప్రేమలేని సంబంధాన్ని భరించలేరు. అందువల్లనే వివాహబంధాన్ని మీరారనే అపవాదు పడతారు. ప్రజలు భార్యలమీద కొంత కొత్త మోజు తగ్గగానే, కామకార్యం సాగిస్తో, దాన్ని గురించి అసహ్యంకూడా పడతారు. ఆ అసహ్యం, ప్రేమ లేని తమ మనస్సులవల్ల కలిగిందని తెలీక, ఆ కార్యంలోనే వుందనుకుని, దాన్ని ఖండించి, త్వరలో విరాగులు కావడానికి, స్వాముల వద్ద చేరతారు గాని, శరీరం మాత్రం, తన అలవాటుని సాగిస్తోనే వుంటుంది. అసహ్యించుకుంటో వేదాంతం బోధించుకుంటో, 'ఏం బతుకు' అనుకుంటో, యింకా జ్ఞానోదయం కాలేదు అని సమర్థించుకుంటో ఈ మాయజీవ యాత్రని గడుపుతో వుంటారు, పట్టెమంచాలమీద. కొంతమంది ఆ అసహ్యమంతా భార్య తప్పు అని ఆ భార్యని తిడుతో, తంతో, జీవితమంతా కాల్చుకు తింటారు.

ప్రేమ అనేది అంతస్తులు కలది. నలభై యేళ్ళ కలసి కాపరం చెయ్యవొచ్చు. కలిసి జైలుకి పోవచ్చు, త్యాగాలు చెయ్యావొచ్చు, అనేకాభిప్రాయాలు, ఏకశరీరాలు కలిగి వుండవొచ్చు. ప్రేమని ఎరక్కపోవొచ్చు. ఒకరు కందిపచ్చడి తయారు చెయ్యడం, యింకోరు పెద్దగా లొట్టలేస్తో తినడం ఒక విధమైన ప్రేమ; కోపమొచ్చి బాగా తన్ని, చీరె కొనిపెట్టడం యింకోరకం: బతికివున్నన్నాళ్ళూ చంపుకుతిని చచ్చినప్పుడు పద్యాలు రాయడం యింకోరకం: ఇటు చూశావు, అటు చూశావని తగాదాలాడి, అజ్ఞలు పెట్టడం యింకోరకం-ఇవన్నీ ప్రేమకిందనే లెక్క.

ఒకటే పుస్తకంలో పనిచెయ్యటం, ఒక పలుకుల్నే యింకోరు చిలకపలుకులు పలకడం, వేరే వుద్దేశ్యాలు కలిగినప్పుడు తీవ్రంగా, బహి

రంగంగా తిట్టుకోడం, ఖండించుకోడం, అదోరకం వున్న ప్రేమ, ఇవన్నీ ప్రేమలోనే లెఖ్ఖ.

మొగవాళ్ళు, స్నేహితులు, ప్రేమ చూపుకుంటారు, చేతులు కలుప్త కుంటారు, హృదయంలోని ప్రేమ శరీరంలో వ్యక్తం కావడం న్యాయంగానే తోస్తుంది. ఎవరూ ఖండించరు. స్త్రీ పురుషులు స్నేహితులై ఆ పనులే చేస్తే సహించరు. ఏమని ప్రశ్నిస్తే 'మీ మనసులు నిర్మలమై పవిత్ర-' అని లెక్చరు ప్రారంభిస్తారు. అవసరమా? అంటారు. పురుషుల్లో అవసరమా? అట్లానే! ఎందుకు కాకూడదూ?

సృష్టి స్త్రీ పురుషులమధ్య, ఈ స్నేహాన్నే ప్రేమనే చూపుకునేందుకు అంతకన్న, గాఢమైనదీ, ఏకత్వాన్నిచ్చేదీ, సన్నిహితమైనదీ ఐన మార్గానికి వీలిచ్చింది. సృష్టిలో యెక్కడా రెండుజీవులు అంతకన్న దగ్గరిగా రావడానికి వీలులేదు. అట్లాంటి అనిర్వచనీయమైన సంబంధంలోంచి కొత్త ప్రాణాన్ని సృజిస్తోంది. కనక యీ సంబంధం ప్రేమని వ్యక్తపరుచుకునే ఒక చిహ్నం; దానికి నీచత్వాన్ని అసహ్యాన్ని ఆరోపించడం కన్న దుష్టమైన ప్రచారంలేదు-అట్లా శాశించడం సోషల్ ఆట్రోక్రసీ.

రోజూ చూసుకునే మిత్రులు ప్రేమని బహిరంగ పరచరు. చాలా కాలమై చూసుకుంటే ఎమోషన్ భరించలేక కావిలించుకుంటారు. అట్లానే స్త్రీ పురుషులు (భార్యాభర్తలే కాక) ఒకరికి ఒకరమున్నామనే మహదానందాన్ని, ఒకరి హృదయ రంజకత్వానికి ఒకరు తోడ్పడుతున్నామనే జ్ఞానం వల్ల, స్నేహాధిక్యతని వెలివరించేందుకు ఉన్మత్తులై ప్రేమని చూపులతో, చేతులతో, పెదవులతో, శరీరమంతటితో చూపడమే సంభోగం. ఆ పవిత్ర కార్యాన్ని నిర్బంధించి, శాసించి, ఖండించడం అమానుషం. ఇంకపిల్లల్ని ముద్దాడడం లాలించడం తప్పు అవుతుంది గావును!



ఇట్లాంటి ప్రేమా, సంయోగంలో రసికత్వమూ వున్నవాళ్లు ఏ పదిమందో వుంటారు. వాళ్ళకోసమే దిగులు. ఈ నీతిపరులా, ప్రేమ కవులూ చేసే ప్రచారాన్ని విని, ఈ పదిమందిలో ఎవరన్నా మిస్లీడ్ అయితే దిగులు. తక్కినవాళ్ళల్లో కూడా యిట్లాంటి ప్రచారం, ఆరోగ్యవంతమూ, సంతుష్టికరమైన సంయోగాన్ని సబ్‌కాంషస్‌గా విషమింపచేస్తుంది.

సంపూర్ణారోగ్యంలో వుండి, సృష్టి సంతోషంతో గంతులు వేసే హృదయాలతో, ఒకరి యవ్వనాన్ని, అందాన్ని చూసి, ఒకరు ఆకర్షణ పొంది మైమరిచి, ఐక్యమై చిన్మయావస్తను పొందవలసిన వయసులో, పిల్లలు పుడతారనే బెంగ పెట్టుకుని, ఒకర్ని పలకరిస్తే యింకొకరికి యెక్కడ కోర్కె కలుగుతుందో అనే భయంతో దూరంగా పారిపోతూ, ద్వేషించుకునే అధోగతికి యీ యవ్వనుల్ని తోలాలనా, ఆశయం! దైవచింతచేస్తే, చన్నీళ్ళ స్నానాలుచేస్తే, దేశక్షేమమే మనసులో వుంచుకుంటే, నిగ్రహమే సాధిస్తే....రుషులైతే....అని ఎన్నో హిరణ్యాక్ష వరాలు కలుపుతారు—అప్పుడు ఈ వాంఛ వుండదంటారు.

బిడ్డలు కనడానికి వీలులేకపోవడం అసహజం. ఈ బీదతనం, అనారోగ్యం అసహజం. అది బాగుపడాలంటే, ప్రజలందరికీ తిండి, స్త్రీలందరికీ ఆరోగ్యం వొచ్చేటప్పటికి ఎన్నివందల యేళ్ళో! ఒక్కొక్క సమయంలో వుపవాసం మంచిదే-అందుకని జన్మ అంతా వుపవాసం చెయ్యండి అంటే!

ప్రజలు మోహించకుండా, కనకుండా ఎట్లానూ ఆపలేరు. ఆపగలిగిందంతా ఈ నిరోధక సాధనాలను వుపయోగించి సుఖపడడాన్నిమాత్రమే. అదీ ఆపలేరుగాని-అవి అవలంబించేందుకు లేజీగా ఇర్రెస్పాంసిబిల్‌గా వుండే మూర్ఖులకి, యీ 'ఫిలాసఫీ' ఒక సాధనం, కొంచం ఆత్మతృప్తి ఇస్తుంది.

కనక సంయోగం ఒక్క పిల్లల్ని కనడానికే కాక, మనుష్యుల్లో అనేకవిధాల అవసరాల్ని కలిగివుంది. భోజనం చూడండి—మృగాల్లో పూరికే ఆకలి తీర్చుకోడానికి. మనుష్యుల్లో—రుచులకి, బంధుత్వానికి, మర్యాదకి. సోషల్ బాండ్స్‌కి, మిత్రత్వానికి, పెలికి, ఎంత అర్థాన్ని అవసరాన్ని పొందిందో! 'కంటిదృష్టి చెడిపోయింది' అంటే చెడిపోవడానికి అర్థం ఇంక కళ్ళు ఉపయోగించకూడదనా? అసహజమైన కంటి అద్దాలు వుపయోగించడం, నీ బాధ్యతల్ని గుర్తించకపోవడమని వాదన చేస్తారా?

సంయోగం వల్ల కలిగే ఆనందాన్ని తీసుకుని, బిడ్డల్ని నిరోధిస్తామనడం తప్పుట. అంత బాధ్యతనీ తీసుకోవాలట. ఎండవల్ల దోవ కనపడుతోంది. వేడికి తల మాడకుండా గొడుగు వేసుకోకూడదు. ఎండవల్ల కలిగే సాధక బాధకాల్ని అన్నిటినీ గ్రహించాలి. లేకపోతే యెండనే వొదులుకోవాలి. ఇళ్ళు కట్టుకోకూడదు. ఎండ తగలకుండా. నిప్పునీ అంతే. అట్లా వుంది యీ వాదన.

తక్కిన సంబంధాలకీ దీనికీ భేదం సంతానం. దేశం బీదది కావడం, తల్లుల ఆరోగ్యం చెడడం అనే కారణాలే లేకపోతే, పిల్లల్ని అనేకమందిని కనడం నాకేమీ తప్పుగా కనపడదు.

ప్రస్తుత పరిస్థితుల్లో పిల్లల్ని అనేకమందిని కనడం అక్రమమని తెలిసింది: సంతాన నిరోధక సాధనాలు వొప్పుకునేందుకు అనేక కారణాల చేత నీతివల్ల వీలయింది కాదు: అందువల్ల అన్ని నిరోధాలలోకీ, అక్రమము, అస్వాభావికము, అనాచరణీయమైన, యీ యింద్రియ నిరోధాన్ని దేశం నెత్తిమీద రుద్దుతున్నారు. ఈ సంగమం ఆనందదాయకమనినీ, ఆరోగ్యకరమనీ, ప్రతిజీవికీ జన్మహక్కనినీ, ప్రేమ అనేది దాంపత్యానికి ముఖ్య అవసరమనీ, అంగీకరిస్తే లాజికల్‌గా విడాకులూ, విడివిడి వివాహాలూ వొప్పుకోవలసి వస్తుందని, ఆ ధైర్యంలేక అసలు శరీర సంబంధా



నికే మో...సరు పెట్టారు. కాని ఈశ్వరుడు లోకసంగ్రహాన్ని యీ నీతివేత్తలహస్తానికి ...వప్పజెప్పాడుగా! కనక లోకం పాగేందుకు ఒక్క బిడ్డని సాంక్షన్ ...చేశారు. మనిషికి ఒక పిల్ల, పిట్టకి ఒక గుడ్డు, పందికీ ?

ఇట్లాంటి నిర్బంధాలు తరతరాలనించి పెడుతూనే వున్నారు. మనభావాలూ, ...బోధనలూ, శాస్త్రాలూ, నీతులూ ఆజ్ఞలూ, చట్టాలూ, వీటన్నిటినీ గడ్డి...చల్ని గోదావరిలాగ, ఈడ్చి మింగేసి తన తోవన వెడుతోంది. జీవన ప్రవాహం కొండలంటి మతాలూ, సామ్రాజ్యాలూ నాగరికతలూ, కొట్టుకొని పోతున్నాయి. కాని యీ లోపున మీ బోధకుల సిన్సియరిటీని నమ్మి - అనుసరించ ప్రయత్నించే వారు చెడిపోతూ వుంటారు.

'నాకు తెలుసు, నా మిత్రులు పదిమంది చెప్పారు. ఈ ఇంద్రియ నిగ్రహంవల్ల చాలా అభివృద్ధిని పొందామని, కనక మేమది అందరికీ బోధిస్తున్నాం' మనడం—

'నాకు తెలుసు నా మిత్రులు నూరుమంది చెప్పారు. స్వేచ్ఛగా అనుభవించడంవల్ల కలిగిన ఆనందం యింక దేనివల్లా కలగలేదని. కనక వ్యభిచారం వుత్తమం' అని నేను రాస్తే ఎంత న్యాయమో, పైదీ అంతే న్యాయం !!



# హిందూ పతివ్రతలు

'మునీంద్రా, మరొక్క విషయము. నా నాధుడు మునిపత్నులను గూడ బలాత్కరించుచున్నాడనియు, ఎప్పుడో యే మునీంద్ర శాపమునకో ఎరకాగలడనియును, వినుచున్నాను. అందుచే ప్రాణేశ్వరుడే యే స్థలములకు, ఏయేకాంతల బలాత్కరింపబోవునో, ఆయా స్థలములకు, నేనుగూడా బోయి, ఆయా కాంతల భర్తలు, నా నాధునికి శాపమివ్వకుండా వారి వారి పాదములపై బడి వేడుకొని, నా నాధుని ప్రాణముల దక్కించుకుని, నా మాంగల్యము స్థిరముగా నుండునట్లు చేసుకొనవలెనని నా తలంపు.

ఈ మాటలు బృందాదేవి నోట అనిపించారు. ఈమె పరమపూజ్యురాలైన సతీతులసిగా పరిణమించింది. లక్ష్మి అవతారము ఈమె పాతివ్రత్యానికే మెచ్చి మహావిష్ణువు వరాలిచ్చాడు. పెళ్ళిలో చూసింది మొదలు తనని ద్వేషించే భర్తని వెన్నంటి, నిమిష నిమిషానికీ కాళ్ళావేళ్ళాపడి బతిమాలి, తన్నులు తిని, యింకా బతిమాలింది. నిరాకరించబడిన ప్రేమను దాచుకుని బాధపడే స్త్రీని చూస్తే గౌరవం పోదు. కాని, యీ నీచత్వాధిక్యతచేతనే పాతివ్రత్యాధిక్యత కొలత చూపుతున్నారు.

నిజంగా బృందాదేవి అనే ఆమె వున్నదా. ఆమె యిట్లా అన్నదా అనే ప్రశ్నతో నాకు పనిలేదు. యివి రాసే కవులకూ వీటిని మెచ్చుకుని అనుసరించే ప్రజలకూ పాతివ్రత్యమంటే వున్న 'ఐడియా'తోనే నా వాదన.

భర్త మునిపత్నుల్ని 'పాడుచేస్తోవుంటే' (మునిపత్నులేనా కాదు, ఋష్యమూర్తుల పత్నుల్ని 'పాడుచేస్తానంటాడు' ఆ మహావీరుడు-! అదీ



తప్పుగా తోచదు మన ఆంధ్ర నైతిక చక్రవర్తులకి!) అతనెక్కడ శాపహతుడౌతాడోనని, బృంద ఆ భర్తల్ని అతన్ని శపించవొద్దని వేడుకుని, తన మాంగల్యాన్ని కాపాడుకుంటుందిట! ఇంతకన్న స్వార్థం వుంటుందా?

సామాన్యులు యీనాటి స్త్రీలుకూడా అంత అధోగతికి దిగరు. ఇంకా ఆ భర్త బతకాలి. ఇతర స్త్రీలకు మానభంగం జరిగితే తనకేం! ఈ మహా పత్ని బృంద తన భర్తతో గాని, ఆ మునితో కాని 'ఇదేమిటి? ఆ ముని పత్నుల్ని చెరచడం? ఎంత అన్యాయం?' అనదు- 'ఆయన కెంత అపాయమో'నని వొణకడం తప్ప.

ఒకవేళ 'ఇదేమిటి? నా భర్త ఇంత ధూర్తుడా!' అన్నదా, ఆమె పతివ్రత మహాత్యం ఒక్క పెట్టున నశిస్తుంది. అట్లాంటి భర్త దుర్మార్గుడని గుర్తించలేని, జడురాలు, మూర్ఖురాలు, యీ లోకాలకి ఆదర్శ పతివ్రత అయింది! అట్లాంటివారిని అనుసరించి స్త్రీ లందరూ అట్లానే తయారైనారు.

ఈ ప్రాతివ్రత్యం అనే పెనుభూతం ముందు తక్కిన సుగుణాల్నీ' శక్తుల్నీ, బలియిచ్చారు. ఎన్నో ఘోరపాపాలు చేశారు. అనసూయలో ఒక పతివ్రత తన భర్తప్రాణం కాపాడ్డానికి సూర్యుడుదయించకూడదంది. ఇట్లాంటి ఉపద్రవాలు లెక్కలేనన్ని చేశారు. అన్ని ధర్మాలూ ధ్వంసం చేశారు! ఈ పతిసేవా, ఆ పతిచేసే పనుల్ని (అన్యాయమైనపైనా సరే) 'ఎన్కరేజ్' చెయ్యడం తప్ప, ఒక్క లోక క్షేమకరమైన కార్యాన్ని స్వబుద్ధితో చేసినట్టు లేదు-యీ పతివ్రతలు.

వీరందరూ ఎందుకు పతివ్రతలైనారంటే, వారు భర్తని సేవించారు గనక. ఆ వొక్క పనితో సూర్యచంద్రుల్ని తలకిందులు చేసే శక్తి

సంపాయిస్తారు. ఇట్లాంటి పాడు కథలన్నీ ఎందుకు పురుషులు కల్పించారో స్పష్టంగా తెలుస్తూనేవుంది. అవన్నీ తప్పుడు కథలని అన్న, యీ వెంకటచలం కథల్ని రాయనీయకుండా శాసనాలు చెయ్యమనడం కూడా ఏ భయం వల్లనో తెలుస్తూనే వుంది. మా పతివ్రతల్ని నీచం చేస్తున్నాడంటారుగదా, యీ బృందాదేవిని కవులు చేసిన దానికన్న నీచురాల్నిగా ఎవరు చెయ్యగలరు?

పూర్వకాలానికి అనుగుణ్యమైన భర్తృ సేవ అనే ఆశయంబోధించి స్త్రీల నీనాడు కూడా వంటిళ్ళకు కట్టిపేయాలని చూసేవారి స్వార్థాన్ని నాశనం చెయ్యాలనే నా ఆశయం. ఇది లోకంలో ప్రతి యింటా, ప్రతి దేశంలో జరుగుతున్న గొప్ప ఎక్స్ప్లాయిటేషన్ పూర్వం పురుషులు కుటుంబ రక్షణ బాధ్యత వహించేవారు; శత్రువులనించి రక్షించేవారు. ఈనాడు పోలీసుల్ని పిలుస్తారు. లేచిపోయిన స్త్రీని మళ్ళీ యిప్పించవలసిందని కోర్టువారిని అడుగుతారు. ఆర్జించడం తప్ప యింక యే అధికారము లేదు పురుషుడి చేతిలో. స్త్రీలు ఆర్జిస్తున్నారు క్రమంగా. కనక, భర్తలకి దొరికిన కడపటి శాసనం పతివ్రతల కథలు బోధించడం. దానికికూడా అడ్డు తగిలితే ఆగ్రహం.

పతివ్రతల కథలతో నాకు తగాదా లేదు. వీటిల్లో చాలా కథలు చాలా అందమైనవి. చదవతగినవి. ఆనందించతగినవి. అనుకరించతగినవి కావు. కనక వాటిమీద గౌరవాన్ని తొలగించాలి. అంతకన్న తెలివీ, శక్తీ గల స్త్రీలని ఆదర్శంగా చూపాలి.

భర్త ఆజ్ఞలను కార్యాలను విమర్శించే స్త్రీలను, స్వబుద్ధి ఉపయోగించి తప్పుకూ ఒప్పుకూ తమ జీవితాన్ని తాము నడుపుకునే స్త్రీలను, యీ



రెండు ఆశయాలకు నడుమ నలిగే స్త్రీలను నేను చిత్రిస్తే ఆగ్రహిస్తున్నారు. ఈ స్త్రీలకేమీ చాతకాదన్నాడు-వినోదినీ విమర్శకుడు.

అవును, సంఘాన్ని జయించలేక ఆత్మహత్యలు, లేచిపోవడాలూ పిచ్చి యెక్కడాలూ, జరిగాయి. ముసలమ్మకు జడిసి అర్థంలేని కర్మ కలాపాలు చేసే మొగమనిషి నా నాయికల్ని వెక్కిరిస్తున్నాడు. వాళ్ళు చేసిన పనుల్లో ఒక్కటి చేయమను! ముందు సంఘంతో విరోధం పెట్టుకునే ధైర్యముంటేగా. అంతేకాదు. మోహంగల స్త్రీని, మోహం వున్నట్టుగా నడుచుకున్న పాత్రను కల్పించినా యీనాటి ప్రపంచానికి వింతగా తోస్తూంది. ఒక సాహిత్య సభాధ్యక్షుడు వారిది 'మార్బిడ్ సైకాలజీ' అన్నాడు. వినోదినీ విమర్శకుడు మనోజాడ్య మన్నాడు. స్త్రీలలో మోహం మార్బిడ్‌గా, జాడ్యంగా కనబడే పురుషులకి ఏమి లోపమో, జాడ్యమో, వూహించుకోండి: కష్టంకాదు.

ఈ పతివ్రతలు హిందూ స్త్రీలకు ఆదర్శంగా వుండాలి కదా, మరి యీనాడు దేశంలో పూజింపబడే స్త్రీలలో ఎవరూ ఈ పతివ్రతా ధర్మాన్ని పాలిస్తున్నట్టు కనబడరే! పతివ్రతల ప్రతిష్టా బాధ్యత వహించిన మహనీయులు కూడా, యీ నూతన స్త్రీలకు జోహార్లు చేస్తూనే వున్నారు. ఇల్లు కదలక పతిని సేవించేవారికి ఏ గౌరవమూ జరుగుతున్నట్టు తోచలేదు. ఆ పూర్వాదర్శాల ప్రకారం భర్త దైవమని కావలసి, పనిబట్టి బోధించి పెంచే కుటుంబమే కనపడదు. పతివ్రతల్ని నీరు పేటెంట్ చేసుకున్న కోపం తప్ప కారణం ఇంకేం లేదు. ఈ పతివ్రతా ధర్మం స్త్రీలు నమ్మడంవల్ల, పురుషులకి జరుగుతున్న యీ కొంచెం ఆనిమల్ కంఫోర్ట్స్ పోతాయనే భయమే కారణాల్లోకి కారణం. ఒకవేళ యీ నూతన స్త్రీలను, ఇతర గుణాలకేగాని, పాతివ్రత్యానికి, గౌరవించటం లేదంటారేమో! మరి వీరు

పూజించే పతివ్రతల్ని పాతివ్రత్యానికేగా పూజించేది! ఆ ఒక్క గుణంలేని స్త్రీలు, ఎంత గొప్పవారైనా, పూజ్యులు కారుగా!

పాపం హిందూ పతివ్రతలగతి యింతవరకు వచ్చింది. వాల్మీకి దగ్గిర్నించి శేషాద్రిరమణ కవులవరకు, దిగ్గజాలవంటి మహాకవులందరూ, వారి శక్తినంతా చూపి చిత్రించారు. యుగయుగాలనుంచి, కోట్లకొలది ప్రజలు పూజిస్తున్నారు. ఈనాటికి నావంటి వాడెవడో వాళ్ళని తర్కించినందుకు ఆ మహా పతివ్రతల మానాలు కాపాడేందుకు, ప్రభుత్వం వారి సహాయం కోరవలసి వచ్చిందా? మరి పతివ్రతల స్థితి ఇంత హీనమై పోయిందనీ ఇంత అపాయం వుందనీ నేను గ్రహించనేలేదు.

నా వొక్కడిచేత భంగపరచబడే మహాత్మ్యం ఇంకా ఎన్నాళ్ళు నిలవగలదో సందేహమే.

★

# అన్యకాంత లడ్డంబైన

కథనిబట్టి చూస్తే, పోతన్నగారు అతడి సుగుణాల్ని వర్ణించినప్పుడు, ప్రహ్లాదుడికి మూడేళ్లూ, పదేళ్ళూ, మధ్య వుండి వుండాలి. ఆ సుగుణాల్లో ముఖ్యమైనదొకటి యేమంటే 'అన్యకాంత లడ్డంబైన మాతృభావముచేసి మరలువాడు.' ఆ పద్యాన్ని లక్షలకొలదీ ఆంధ్రులు చదివి 'ఆహా,హా,హా' అని గుడ్లుతేలేసి లొట్టలువేస్తో ఆనందిస్తున్నారు. పండితులైన గురువులు ప్రతిపదార్థ తాత్పర్యసహితంగా యీ పద్యాన్ని బోధిస్తున్నారు. ఒక్క పదహారేళ్ళన్నా వుంటేనేగాని అన్యకాంతల విషయమై కీర్తిని పొందడం అసహజంకదా, అంత చిన్నవాడు మాతృభావం చేశాడని యెందుకు కీర్తించారో కవులు, ఇదేమి విపరీతమా అని యోచించరేమో పాఠకులు! ఒక వేళ ఆ కృతయుగ పుణ్యకాలంలో, బ్రహ్మచర్యం నిర్విఘ్నంగా సాగే ఆ ధర్మయుగంలో, కామోద్రేకం అంత చిన్నతనంలోనే కలుగుతో వుండేది గావును! లేక ఆ విష్ణుభక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు యీ కామ విషయంలో 'ఎబ్నార్మల్'గా జాడ్యం కలవాడా? పెళ్ళికాని ప్రహ్లాదుడికి 'అన్యకాంత' అంటే, అర్థమేమిటి? తల్లి కాని కాంతా? తల్లి కానివాళ్ళని 'మాతృభావం' చేశాడా? తల్లి అనుకున్నాడా? అంటే పుటకతోటే 'ఇడియట్' అన్నమాట.

పురాణాల అసందర్భాలతో పోట్లాడాలంటే, ఒక్క జన్మ చాలదు. ప్రహ్లాదుణ్ణి గురించి కవి యిట్లా రాయడం పొరబాటు. ఇట్లాంటి పొరబాటు

ఎందువల్ల కలిగింది? దీనిని పాఠకులు ఎందుకు గమనించరు? కారణం లేకపోలేదు. స్త్రీలను మాతృభావం చెయ్యడమనేది, ఒక సుగుణంగా ముద్రపడ్డది, సత్యమూ, న్యాయమూ, ధర్మమూ, అధ్యాత్మికమూ, భక్తీ, పాతివ్రత్యమూ—ఇట్లాంటి మాటలవలె. ఈ మాటచుట్టూ ఒక గొప్ప 'ఆరా' 'ఎట్మాస్ఫియర్' ఏర్పడ్డది కనక యీ మాటల కర్థమేమిటి, వీటి ప్రయోగము సమయోచితమా అని అడగడానికి వీలులేదు. అవసరం వున్నచోటా, లేనిచోటా, ఈ పవిత్ర పదాన్ని విదిలించవొచ్చు. వాటి అన్వయాన్ని ప్రశ్నించడానికి పజలకు మతులు లేవు. గుండెలు లేవు. సత్యమూ, నీతీ, న్యాయమూ ఇల్లాంటి పదాల అర్థం ప్రశ్నించినవాడు ఉన్మత్తుడనే ప్రజల వుద్దేశ్యం. పడమటివారి జండాలవలె. తూర్పువారి తోరణాలవలె, ఆడవారి పసుపువలె, స్కూళ్ళలో రాజభక్తి గీతాలవలె, ఈ ధర్మపదాల్ని కూడా, ఎక్కడ, ఎంత ఉపయోగించినా, అమితమంటో లేదు. ఈ నీతి సామగ్రిని చేతికి దొరికినట్టు పద్యాలలో విసిరిపెయ్యవొచ్చు. ఎంతవేస్తే అంత యీ లోకంలో కీర్తీ, ఆ లోకంలో ముక్తీ.

ఒక్క ప్రహ్లాదుడేకాదు, ఈ లోకంలో ప్రతి మొగవాడూ కూడా 'అన్యకాంత'ల్నించి తప్పుకుంటో వుండాలని నీతి ఆశయం. పసిపిల్లలూ, ముసలివారూ తప్ప యింక యే ఆడవారు కంటపడ్డా వారినుంచి 'మరలుతో' వుండాలి. తలెత్తి చూడకూడదు. వూరికే మోటార్లను ఆవులు తప్పుకుంటున్నట్టు 'మరలుతో' వుండాలి. ఇట్లాటి నీతి బోధనవల్లనే, యిన్ని వోరచూపులూ, అధో దృష్టులూ, దొంగకళ్లూ బైలుదేరాయి. ఇట్లా మాతృభావం చెయ్యమనడానికి కారణంవుంది స్త్రీలనుకూడా సాధారణ మానవుల్నిచూసినట్టు చూడగలిగినవారికి యీ మరలడం అవసరముండదు. స్త్రీనిచూస్తే అమితమైన కామేచ్ఛ, కాపీనం, దత్తి, తృప్తిపడని రసికత్వం, వీటితో పెత్రెత్తి కొట్టుకొంటో వుంటేనేగాని, ఇట్లాంటి నిబంధన అనవసరం. స్త్రీ



దగ్గిరగా పెడితే, తమ యింద్రియాలు తిరగబడి, స్వాధీనంతప్పి, కాము ఏం చేస్తామోనని యీ నీతిపరులకు భయం. ఆమె ఉద్యోగంగాని, ఆమె ముఖంలోని దయగాని, కళగాని, తేజస్సుగాని కనపడదు. ఒకటే తోస్తుంది-కామం. కామం అధ్యాత్మికంగా అధోగతి మార్గం కనక అసలే తప్పుకోమన్నారు. స్త్రీని చూసి కామం జ్ఞాపకం రాకపోవడమూ జ్ఞాపకమొచ్చినా నిగ్రహించుకో గలగడమూ, ఈ శాస్త్రకారులకు కలలోనన్నా తోచదు. కనకముందే 'మరల'మన్నాడు. ఇదీ ప్రజల మనోవృత్తి. ఇట్లాంటి నీతి పాడై పోతుందనే, ప్రజల విచారం.

ఓ స్నేహితుడు, 'పెళ్లాం కొడుతుందిరా నిన్ను!" అంటే,

'గుండెలే నన్ను కొట్టడానికి! గదిలోకి పోయి గడియవేసుకు పడుకుంటాను. నన్ను కొట్టడానికి గుండెలే' అన్నాడు.

ఇంకో ఆయన, 'పెద్దపులి వేటకు పోతున్నారే మీరు, పెద్దపులిని చూస్తే భయంకాదా మీకు?' అంటే.

'నాకా? నాకేం భయం? ఏం చేస్తుంది పెద్దపులి? పెద్ద చెట్టుమీద కూచుంటాగా! వెధవ పులి! పులిని చూస్తే భయమెందుకండీ!' ఇదే రకం, యీ నీతిపరుల నీతి!

అంతేకాదు, 'మాతృభావం' కూడా చెయ్యాలి. చేస్తేనేగాని వీరికి మనసు స్వాధీనపడదు. పరస్త్రీని చూడగానే తల్లిని తలుచుకుని, ఆ తల్లిని కామించడం యెంత కష్టమో, అయిష్టమో, బాగా మనసులో మననం చేసుకుని ఆ యిష్టాన్ని, ప్రస్తుత స్త్రీ యెడల ఎప్లై చేసేటంత ఎఫోర్ట్ పెడితేనే గాని, మనసుస్వాధీనంలోకి రాదు. స్త్రీని చూసినప్పుడల్లా యింత 'స్ట్రగుల్'. నీతివంతులుకాని సామాన్య పాపాత్ములు, అన్యకాంతల్ని తల్లులూ అనుకోరు, భార్యలూ అనుకోరు, వూరికే మనుషులనుకుంటారు. 'మరలీ'

పోరు, రాసుకునీపోరు, తమ దోవన తాము పోతారు. ఎవరిమీదో వారికి కామం కలుగుతుంది. వారినే జాగ్రత్తగా చూస్తారు, ఆనందిస్తారు.

దీనివల్ల మనకు విశదమయ్యే దేమిటంటే, యీ నీతి విషయమై పూచీపుచ్చుకున్న మహానుభావులందరూ చాలా వీక్‌విల్డ్ పీపుల్ అందువల్లనే లోకమంతా తమవంటి దౌర్భాగ్యులే అనుకుంటారు. ప్రతి స్త్రీని చూసీ, కామోద్రేకం పడని మనుష్యులుగాని, స్త్రీతో చనువుగావుండి కూడా యింద్రియాలు స్వాధీనం తప్పని మనుష్యులుగాని వున్నారని వీరిని నమ్మించడం చాలా కష్టం. ఆధారంలేని 'స్కాండల్సు' పుట్టించడంలో చాలా నేర్పరులు వీరు. ఆడదీ, మొగాడూ మాట్లాడితేచాలు వీరి స్టాండర్డ్‌ని పట్టి మనసులో ఎంత కల్మషమున్నా తప్పులేదు. చూపు చూడకపోతేచాలు. మనసెంత నిర్మలమైనా లెక్కలోకి రాదు. చూపు చూశాడా పాపంలో పడ్డాడన్నమాటే. అది పుత్త వేకంట్ చూపైనాసరే.

ఇట్లాంటి నీతి ఎందుకు బోధిస్తారయ్యా అంటే, వారి నీతి స్టాండర్డ్ అంతే గనక. ఈ బోధనవల్ల, బోధకులు చాలా నీతి పరులని ప్రపంచం మోసపోయేందుకు. యీ నీతి బోధకులకే నిజంగా లోకంమీదా నీతిమీదా ప్రేమవుంటే, నీతి మీరినవారిని చూస్తే, జాలి కలుగుతుంది వారికి. అంతే కాని యిప్పటివలె ద్వేషం కలగదు. తాము దేన్ని అభిలషించి కూడా అనుభవించడానికి జంకుతున్నారో, దాన్ని పాపాత్ములు అనుభవించి పోతున్నారనే యీర్ష్య.

ఈ దొంగతనాలు యెక్కువైనకొద్దీ కొత్త సంఘ మర్యాదలు బైలుదేరుతున్నాయి. స్త్రీని చూడగానే కొంచెం దూరంగా జరిగి, కళ్ళు కిందికి వాల్చి, నమ్రతతో నమస్కరించి, మెల్లిగా అసహజమైన గొంతుతో మాట్లాడాలి. ఇది విక్టోరియన్ ఏజ్ ఇంగ్లీషు మర్యాద. తక్కిన విజ్ఞానాల



వలెనే, ఇంగ్లీషువారు వొదిలేసింతరవాత సముద్రాలు దాటి మనకి దిగుమతి అయింది. ముఖ్యంగా యీ మర్యాదలు సంఘ సంస్కర్తలలోనూ, ఆర్య బ్రహ్మ సమాజాలలోనూ, ఇండియన్ క్రిస్టియన్లలోనూ, మద్రాసులోనూ కనపడతాయి.

స్త్రీలూ ఇంతే, ఇంగ్లీషు పద్ధతిగా పురుషుడు తనచేతిని పట్టుకుపూపుతాడేమోననే సందేహంతో, ముందే చేతులుముడిచి నమస్కరిస్తారు. అపాయం దాటిందాకా ఆ నమస్కారాన్ని వొదలరు. నవ్వరు. సహజంగా మాట్లాడరు. ఎవరన్నా కొంచెం చనువుగా, స్వేచ్ఛగా మాట్లాడారా, మొహాలు చిట్లించి, మెడలు తిప్పుకుంటారు. పురుషులున్నచోట, తాము కూచునేప్పుడు కుర్చీ అరగజం దూరంగా జరుపుకునిగాని కూచోని స్త్రీలు నశ్యతు. అంతసేపూ పమిటిని యిటూ అటూ లాగిలాగి కప్పుకుంటారు— కప్పుకోడానికి ఏమీ లేనివాళ్ళుకూడా. కుచ్చెళ్ళు పాదాలమీదికి తోసుకుంటారు. మళ్ళీ ఆ పమిటా కుచ్చెళ్ళూ తొలుగుతాయి. మళ్ళీ సరిచేసుకోవాలి. జీవితసూత్రమే దాంటోవుంది. ఏదన్నా వొస్తువు అందియ్యవలసివొస్తే ఒక్క చివరపట్టుకుని 'వేళ్ల తగులుతాయి. భద్రం'అని అంటున్నట్టు ముందుకు తోస్తారు, అన్ని అవయవాలూ రహస్యంగా పురుషులకి వొప్పచెప్పేవారే, యీ జాగ్రత్తలో అగ్రాగ్రేసురులు. తాము కోరని పురుషుణ్ణి చూసినా, యీ సిగ్గు నటిస్తారు. అర్థమేమిటంటే, తాను కోరకపోయినా, బలవంతంగా మీదపడే 'పాసిబిలిటీస్' వున్నాయని వారు మరిచిపోరు, యితరుల్ని మరిచిపోనీరు.

స్త్రీ పురుష లొకరినొకరు చూడగానే చూపులేకాదు, తలపులు కూడా కిందభాగాలకే దిగుతాయి. రోడ్డువెంట వొంటరిగా, పరపురుషుడితో నవ్వుతో మాట్లాడుతో సరదాగా నడిచే కూరల అమ్మల్ని, పాల అమ్మల్ని

చూసి కూడా బుద్ధిరాదుకద ప్రజలకి! ఆ సిగ్గూ బెట్టూ వొదిలి సహజంగా మాట్లాడిందా, యీ స్త్రీలకి తమ శీలాన్నెట్లా కాపాడుకోవాలో తెలీదు. అందు వల్లనే యీసిగ్గుకి యింత ప్రాముఖ్యతవొచ్చింది. సిగ్గేభూషణం. సిగ్గువిడిస్తే శీలంవిడిచినట్టే. సిగ్గు ఎంత ఎక్కువ నటిస్తే అంతపవిత్రురాలు. చనువిచ్చి కూడా, స్నేహితులై కూడా ఇతరుల్ని 'డిసిప్లిన్'లో ఎట్లా వుంచాలో చాత కాదు. 'కారెక్టర్ లోపం'.

ఈ స్త్రీలు వుత్తరాలురాస్తే, ముందు ప్రతివాడికీ 'సోదరా' అని రాస్తారు. అర్థమేమిటి? 'ఇది ప్రేమలేఖ అనుకోకండి. మీరు నా అన్న. ఈ ఉత్తరం మీ రింకెవరికి చూపినా, వారికి అల్లానే కనపడాలి' అన్నమాట. పరిచయం ఎక్కువై శరీరాలు కలిసిన తరవాత కూడా 'సోదరా, అనే రాస్తారు. ఇంకెవరన్నా చూస్తే! స్వంత సోదరుడిమీద వారికి వుండే అభి ప్రాయం వ్యక్తమవుతుంది.

స్త్రీలమీద ప్రపంచానికి యింత అపనమ్మకం గనుకనూ, స్త్రీని యీ విషయమై డామ్ చెయ్యడమూ, గాయం చెయ్యడమూ యింత సులభం గన కనూ, స్త్రీ శీలం తన సొమ్మని పురుషులనుకోడంవల్లనూ, స్త్రీని శిక్షించే అధికారం ప్రతి పురుషుడికీ ఉండడంవల్లనూ, స్త్రీ యింత మోసకత్తే, అబద్ధీకురాలూ, ఐ జీవితమంతా నటిస్తోంది. ఈ విధంగా స్త్రీని మార్చి పైగా పుస్తకాలనిండా, పురాణాలనిండా, ఆమెని చెడతిట్టారు యీ పురు షులు. కనకనే స్త్రీలు నాటకాలు వెయ్యడమంటే మర్యాదస్తులకి అంత అపనమ్మకం. ఒకరి భార్యగా వేషం వేసినా, నిజంగా ఆయన్ని వరించని స్థిరత్వం స్త్రీకి వుంటుందని భావించుకోలేరు. అంత విశ్వాసముంది వీరికి తమ హిందూ నారీశిరోమణులలో!

స్త్రీలూ అంతే. నాటకాలలో వేషం వేస్తారా అని అడగడాన్ని తక్కువ వేషధారులతో రమిస్తారా అని అడగినట్టు భావిస్తారు. మండిపడ



తారు! కోపమెందుకు? 'వెయ్యను' అంటే సరిపోదా! 'నా యిష్టం, నా హృద యంలోని రహస్యాభిలాష, నాకు ఆ అభిలాషని నెరవేర్చుకునే ధైర్యం లేదనే సంగతి వీరికెట్లా తెలిసింది?' అని కోపం! వారి శీల శక్తిలో వారికి నమ్మకం లేకపోబట్టే, అంత ద్వేషం.

ఒక వితంతువు వుంది. అందరికీ భగవద్గీతలు బోధిస్తుంది. ఆమె ఓ కుర్రాణ్ణి దగ్గిరతీసి, 'నాయన, మా నాయన' అంటో వుంటుంది అట్లా నాయన సంబంధం పెట్టుకోకపోతే అనవసరమైన ప్రశ్నలు వొస్తాయి ఆ 'నాయన'వల్ల గర్భం కలిగింది. పోగొట్టుకునే ప్రయత్నంలో ప్రాణాలే పోగొట్టుకోడానికి సిద్ధమయింది. కడుపులో బిల్ల పెరిగిందని, పండరీ పూరుపోయి, కని, నిర్దాక్షిణ్యంగా, ఆ పిల్లని వొదిలి, తిరిగి వొచ్చింది. అందరితోనూ పెద్ద ఆపరేషన్ అయిందని చెప్పి నమ్మించజూచి వ్యర్థురాలై తలుపులు మూసుకుని బతుకుతోంది. తన కళ్ళ తేజస్సుతో తన ఆస్తిని వాజ్యాలనుంచి కాపాడుకుంటోంది. సినీమావాళ్ళు వొచ్చి, టాకీలో చేరమని అడిగేప్పటికి, బూతులు తిట్టింది. వాళ్ళనీ, నాటకాలనూ, సినీమాలనూ: ఆ తిట్టేప్పుడు కూడా మొహానికి, పెదవులకీ రంగు వేసుకునే వుంది ఆమె. ఇంట్లో మనుష్యులు కొత్తవాళ్ళు వుంటే అర్ధరాత్రులు పూసుకుంటుంది, రంగుల్ని. ఆమెకి సినిమాలంటే అమితమైన కోపం? ఇంటినిండా సినీమా పత్రికలు మళ్ళీ!

ఆమెకివున్న నీతీ కీర్తి యితరులకి వుంటుందా!



# ప్లేటోనిక్ లవ్

ఈ రకం ప్రేమ నూతనం. దీనిఅర్థమేమిటంటే: స్త్రీ పురుషులకు సహజమైన ప్రేమ కలిగినప్పుడు. శరీర సంబంధం జరగనీక, మానసిక సంబంధాన్నే చూపుకోడం-అంటే. మామిడిపళ్ళమీద యిష్టం కలిగినప్పుడు, వాటిని ముందు పెట్టుకుని ఆనందిస్తో, కూచోడం, కాకపోతే కొంచెంవాసన చూడడం. ఇటువంటి అవస్త కొన్ని కారణాలవల్ల కలుగుతుంది.

1. ఈ ప్రేమ కలిగిన వారికి వేరే భార్యాభర్తలుండి, వారు దౌర్జన్యం చేస్తారనే భయంవల్ల.
2. సంఘ అపకీర్తి భయంవల్ల.
3. అశక్తతవల్ల.
4. రోగాల భయంవల్ల.
5. శరీర సంబంధం దుర్నీతి అని తలవడంవల్ల.

కాని యీ ప్లేటోనిక్‌వారు యీ కారణాల్లో ఏదీ వుందని వొప్పుకోరు. 'ఈస్తటిక్సు, మాట్లాడతారు. శరీర సంబంధం పశుత్వమూ, నీచమూ అనే అభిప్రాయాన్ని చాటుతారు.

మొగవాళ్ళ స్నేహంగా లేదా ఆట్లా స్త్రీ పురుషులు స్నేహంగా వుంటేనేం అనవొచ్చు. కాని అట్లా అంటే ఎట్లా వుంటుందంటే, మల్లెపువ్వుని వాసన చూసి తృప్తిపడటం లేదా, జామపండును కూడా వాసన చూసి సంతోషించరాదా అని, అడిగినట్టుంటుంది. ఈ స్త్రీపురుషులు ఒకర్ని వొకరు కలుసుకోకుండానూ వుండలేరు, చూసి అనుభవించనూలేరు. దీన్నే



గ్రీకులు 'టాంటలస్'కి నరకంలో విధించినశిక్ష. భోజనంమీద ప్రీతి, తింటే అరగదు. కనక నోట్లో పెట్టుకుని చప్పరించి వుమ్మేసినట్టు, స్త్రీ పురుషులు వొకర్ని వొకరు ఏ అవయవాల ద్వారా అనుభవించాలో, ఆ భాగాల్నినొక్కిపెట్టి, తక్కిన అవయవాలతో అనుభవించి, అది వున్నతమూ, నిర్మలమూ అని బోధించడం. ఆహారాన్ని చెవులలోనూ, కళ్ళల్లోనూ దూర్చుకుని—నోట్లో పెట్టుకోడం పశుత్వమని బోధించడం. పూర్వకాలంలో కాతలిక్ సన్యాసు లిట్లానే చేసేవారట. వారికి వివాహం నిషేధం. స్త్రీ వర్జనీయమన్నారు. కనుక వాళ్ళు తర్కించారు. నిషేధం అంటే యేమిటి? ఆ సంసార కార్యంమాత్రం పనికిరాదు. అదే నరక కారణం, అని పడుచుపిల్లల్ని పక్కలో పడుకో పెట్టుకుని, నరక కారణం తప్ప తక్కిన భాగాలన్నీ అనుభవించేవారు.

నవీనయుగంలో, నాగరికతవల్లనో, లేక శరీర బలహీనత్వంవల్లనో యీ మనోవ్యభిచారం చాలా వృద్ధి పొందింది—సహజమార్గం అరికట్టడంవల్ల వివిధ అసహజ మార్గాల ప్రసరిస్తోంది. అనుశ్రుతంగా సాధారణులు ప్రయోగించే బూతుమాటలకు నవీన విద్యాధికులుచేసే అశ్లీల ప్రసంగాలకు ఎంతో భేదముంది. సామాన్య భాషలో కలిసి, ఏమంటున్నారో తెలీకండా అర్థం యోచించకుండా, 'అన్‌కాన్షస్'గా మాట్లాడతారు మొదటివారు. రెండోవారు యోచించి, కొంత సెక్షుయెల్ ఎక్సైట్మెంట్ అనుభవిస్తో యావ తీర్చుకుంటారు, ఆ మాటలద్వారా. ముఖ్యంగా తమకు కోరతగినదీ, (ఐతే) లభ్యం కానిదీ ఐన స్త్రీని గురించి కొన్ని నీచవాదులూ, బూతుమాటలూ మాట్లాడి తృప్తిని పొందుతారు. భావనాశక్తి హెచ్చైనవారు యింటికిపోయి చెప్పరాని మార్గాన సంతుష్టి పొంద ప్రయత్నిస్తారు. కాని దైరెక్టుగా ప్రశ్నవేళామా—

"ఎబ్బే! శరీర సౌఖ్యమా? చాలా తుచ్ఛమూ పశుత్వమూనండి. తాత్కాలికమైన ఆకార్యంవల్ల నాగరికతగల మనబోటివాళ్ళకి ఆత్మసంతుష్టి కలుగగలదా? చమత్కార సంభాషణా, వార్తాచర్చా, మనో ఆకర్షణా యివి ప్రధానమైనవి. దూరాన్నించి చూసే ఆనందం, ఆలింగనాలవల్ల కలుగుతుందా?" అంటారు.

కాని యీ మానసిక ఆకర్షణకీ, సంభాషణకీ, ప్లేటోనిక్ లవ్‌కికూడా మళ్ళీ అందమైన స్త్రీలే కావాలి. చమత్కారీ విద్వాంసురాలైన స్త్రీ పనికి రాదు, కురూపి ఐతే.

ఈ భావమే ప్రస్తుత వివాహ విధానంలోకి కూడా ప్రవేశించింది. 'అంద మెందుకండీ: గుణం కావాలిగాని!' అంచంలేని మాట కనపడుతోనే వుంటుందిగాని, ఆ గుణం యెక్కడవుందో, వాళ్ళెట్లా గ్రహించగలిగారో యెవరికీ తెలీదు. శరీర సౌందర్యమే, ఆరోగ్యమే, ప్రధాన లక్షణంగా అంగీకరించారా, దానినించి యెప్పు డే కంక్లూజన్స్ వల్ల, యే విప్లవాలు అంగీకరించవలసి వొస్తుందో అని భయం. సౌందర్యం వున్నచోట గుణం లేదనీ, అందవికారంలో గొప్ప సుగుణ మున్నదనీ, నమ్మకం.

ఈ ప్లేటోనిక్ లవ్‌గల మనుష్యులకి భార్యలుంటారు. వాళ్ళతో అట్టే యీ మానసిక సంబంధంవున్నట్టు తోచదు. నిజమేమోగాని, పిల్లలు పుడుతోనే వున్నారు.

తెలిసిన స్త్రీతోనల్లా శరీర సంబంధం వుండాలా అని అడుగుకారు. కాదు. ప్రేమో కామమో, ఏదో కలిగినప్పుడు సహజ మార్గాల ఫలితం పొందలేరా అనే ఆశ్చర్యమూ, విచారమూ నాకు.

'స్త్రీతో ఒక్క శరీర సంబంధమేనా ముఖ్యం?' అంటే కాదు. స్నేహమూ, కళా, మనోవికాసమూ. అన్నీ వుంటాయి సంస్కారాన్నిబట్టి. కాని అక్కడే ఆగడమెందుకూ? లేక ఆగినట్టు నటన యెందుకా అనుకుం



టాను. గులాబిపువ్వుని చూడాలి, తాకాలి, వాసనచూడాలి. 'కాదు. చూస్తాను, కోటుకి పెట్టుకుంటాను. వాసనమాత్రం చూడ'నంటే, ఏమి ముళ్ళభయమా? ముక్కుకి జలుబా, పొడుము అలవాటువల్ల వాసన శక్తిపోయిందా, ఇంకేదన్నా విపరీత కారణమా, అని యోచించవలసి వొస్తుంది.

ఇట్లాంటి కొత్త 'లవ్' మన ఆర్టిస్ట్సులో అమితంగా బైలుదేరింది. పద్యాలలో, కథలలోనూ, పటాలలోనూ, వీరు చిత్రించే మనుషులకి కోర్కెలేగాని అవయవాలు లేవు. అవయవాలు వున్నా, వాటికి కోర్కెలు లేవు, అవి పనిచేయవు

విరాగులై స్త్రీ పురుషులు పరస్పరం వర్జించుకోడం ఎవరి స్వేచ్ఛ వారిదీ. భార్యనే ప్రేమించి పరధ్యాన లేని మనుష్యులు ధన్యులేనేమో! కాని సౌందర్యాన్ని వాంఛించడము సహజమే. వాంఛించి తరువాత సహజంగా అనుభవించక, కొత్త థియరీలు పెట్టి వంకర్లు పెట్టడం అసహజం, అనారోగ్యం, జోరత్వం.

ఇట్టాంటి ఆరోగ్యానికి ముఖ్యవిరోధి పుణ్యాత్ములు ఏర్పరిచిన నీతి. ఆ నీతినీ, లోకాపవాదునూ, మీరే ధైర్యంలేక, యిట్లాంటి అసహజపు థియరీలు చాటుకుంటో మర్యాదను నిలుపుకోవలసిన అవస్థ పట్టింది ప్రజలకి.

ముక్తి అనీ, స్వర్గమనీ, ఆధ్యాత్మికమనీ, ఏదో ప్రపంచాలున్నాయనీ నమ్మి, యీ ప్రపంచపు సౌందర్యాలకూ, ఆనందాలకూ కళ్ళు మూసుకునే మూర్ఖులూ: కీర్తినీ, మర్యాదనూ, వాంఛించి, తమ స్వంత సౌఖ్యాన్ని ధ్వంసం చేసుకునే అవివేకులూ: చివరికి మరణం తరవాత ఏమీ లేకపోయినా, వాళ్ళనుకునే నీతిచట్టాల శిక్షలు లేకపోయినా యేమవుతారో? ప్రజలు ఆనందించే యీ లోకంలో వున్న సౌందర్యాలలో శరీర సౌందర్యం అతీతమయినది. ఆ సౌందర్యాన్ని గుర్తించి తపించలేని పశువుల సంగతి

అటుంచి, కళ్ళున్న రసికులు భయంతో దొంగ వెగటుతో, తప్పుకోడం, అబద్ధాలు మాట్లాడడం చూస్తే దిగులేస్తుంది. సంస్కారమనేదీ, పవిత్రత అనేదీ, పాతివ్రత్యమనేదీ, ఆత్మసంయోగమూ, గుణాల సౌందర్యమూ, అని చెప్పేదీ చచ్చుపీనుగుల్ని కావిలించుకుని పిల్లల్ని కనేదీ, అదీ చాతగాక యేడ్చేదీ ఇదీ జీవితం.

ఈ శరీర సంబంధమే శాశ్వతమనీ, ఆశయమనీ అనటంలేదు. ఈ గుణాలూ, మనసులూ, ఆత్మలూ, వాటిల్లోని సౌందర్యాలూ, ఏకత్వాలూ మాట్లాడే ప్రభువులకి. శరీరాలూ, వాటిల్లో కొన్ని అవయవాలూ తప్ప యింకేమీ తెలీదు. ఎప్పుడూ వీళ్ళు డబ్బూ, ప్రతిష్టా, ఆస్తి, ఉద్యోగమూ, లంచమూ, మోసమూ అని తిరుగుతారు. వీళ్ళకి భార్యలో సుగుణాలు కావాలట, ధర్మపత్నులు అవసరమట.

ఏనాటికైనా, ఏ జన్మకైనా (జన్మలుంటే) యీ శరీర సంబంధాన్ని దాటించి మరిపించగల జ్యోతినీ, ఆత్మ సౌందర్యాన్నీ, స్నేహభావాన్నీ, కళాజీవితాన్నీ తీసుకురాగల వ్యక్తి తటస్థించవొచ్చనీ, ఆ వ్యక్తికి ప్రణయాన్ని స్వీకరించేందుకు అర్హతగల అభివృద్ధినీ, పరిమాణాన్నీ, ఔన్నత్యాన్నీ, పొందగలనేమోననీ, ఉత్తశరీరాలను మాత్రమే ప్రేమించే నావంటి అధముడుకూడా కలలు కంటున్నాడు. కాని అట్లాంటి అభివృద్ధి శరీరాలు ప్రేమించేవారికే రాలేదే. శరీరాలు కూడా ధైర్యంగా ప్రేమించలేని శవబాహుళ్యాలకి లభిస్తుందా, ఎన్నిసార్లు ఆత్మలు, ఆత్మలని బహిరంగ భాషణలు శలవిచ్చినా?

ఈ కాలంలో పుడుతున్న గీతాల్ని చదవండి. ఆ గీతాల్లో అన్నీ ఆత్మలే. ఆ ప్రియులకు, ప్రేయసులకీ పేర్లులేవు. శరీరాలులేవు—ఆ కాముకులు ఎగురుతారు. మాయమౌతారు. మబ్బుల్లో దూరుతారు. పువ్వుల్లోంచి పలుకుతారు—సాధారణ కాముకులు చేసే పని వొక్కటీ చెయ్యరు—'ఏ



హృదయేశ్వరి'లోనో యెంకి పాటల్లోనో తక్కినవారి వలె నడుస్తారు. నవ్వుతారు. కాని మొదటిదాంటో నడవకండా నవ్వకండా మాయమైతేనే బావుంటుందనిపిస్తుంది.

శరీరాలనించి అతీతమైన ప్రేమను పొయెట్రీ చూపకపోతే యింకెవరు చూపగలరు? కాని ఆ భావాన్ని అనుభవానికి తీసుకువచ్చి అశాంతి కలిగించగల యే కృష్ణశాస్త్రి వంటివారో ఒక్కరు రాస్తే చాలదా? ప్రతి కవి ప్రేయసీ, విద్యుల్లతలలో కలిసి, నక్షత్రాల్లోంచి తొంగి చూడడమేనా?

కాని యీ కవులలో వొక్కరూ ఆకాశంవంక చూడరురాత్రులు—చీకటి గదుల్లో, నల్లుల్ని యేరుకుంటో భార్యని పక్కకి తిరగమని పోట్లాడతారు. పర స్త్రీ కావలసివొస్తే, రోడ్డువంక చూస్తో లొట్టలేస్తారు: ఎవత్తెనో చూసి మరీ భరించలేకపోతే,

'ఆమె నా హృదయంపు ఎడారికొనల' అని గీతం రాస్తారు. ఆమె యెవరో! పేరూ వూరూ రాస్తే తంతారని భయం.

అందుకని-ఆమె ఆత్మా, కవి ఆత్మా మబ్బుతెరల్లోకి యెగిరి, యిటూ అటూ యెగిరి యెగిరి, ఇక్కడ వాలి, అక్కడ వాలి-మాయమైపోతారు.

ఇంక కథల సంగతి చెప్పనక్కర్లేదు. నాలుగైదు కొత్త కథలను చదివామా, ఇంక జన్మకి మోహంమీద వెగటు తోస్తుంది. మరీ యింత నీచులా, అల్పులా, లేకివాళ్ళూ భీరులా, నిజంగా వున్నారా, అని ఆలోచిస్తాం.



# పత్రికలు చేసే అపచారం

ప్రస్తుతం సినీమాలకూ, పత్రికలకూ జనుల వుద్దేశంమీద వున్న శక్తి యింక వేటికీ లేదు. సినిమా బొమ్మలు ఊహా ప్రపంచంలో కొన్ని అనుభవాలని చూపుతాయి. పత్రికలు వాస్తవ ప్రపంచాన్ని గూర్చి కొన్ని వుద్దేశ్యాలను పురికొల్పుతాయి. పత్రికాధికారులకు ప్రజాభిప్రాయాలమీద అనంతమైన శక్తి వుంటుంది. యూరప్ దేశంలో పత్రికలు దేశాలకు దేశాలకు విరోధాలు కల్పించగలవు, మాన్పగలవు. రాను రాను మనదేశంలో కూడా పత్రికల ప్రోత్సాహం హెచ్చుతోంది. వార్తలను మాత్రమేగాక తమ స్వంత అభిప్రాయాలను వెలిబుచ్చి ప్రజల అభిప్రాయాలను మార్చడానికి పత్రికలు సాధనంగా వుపయోగించడం మామూలయింది. పత్రికాధిపతులు కూడా మానవమాత్రులే గనుక (మానవమాత్రులమేనని వారంగీకరించకపోయినా) వారి వారి మనసులకు తోచింది, పత్రిక 'పాలసీ'ని బట్టి వారు ప్రజలకు ఉపయోగమనుకున్నవన్నీ రాస్తోవుంటారు.

వంటచేసేందుకూ, క్షవరానికీ, వడ్రంగానికీ, బిక్షానికీ ట్రెయినింగు కావాలి. కాని ప్రజలను యే వెర్రి వూహలకైనా ప్రోత్సహింపగల పత్రికాధిపతికి మాత్రం ఏ విధమైన శిక్షణా అవసరంలేదు. డబ్బూ, (అప్పైనా సరే) పత్రిక పెట్టాలనే 'వేనిటీ' యీ రెండే సూత్రాలు. ఏ విషయాన్ని గురించైనా రాయ పూనుకున్నప్పుడు ఏమాత్రం ఆ విషయమై తమకు తెలుసుననే ఆలోచన లేదు. గొప్ప గొప్ప వేదాంతులు శాస్త్రజ్ఞులు తమ జ్ఞానం



అత్యల్పమంటారు. డాక్టర్లు, లాయర్లు, టీచర్లు, (వీరివిషయంసందేహమే?) యింజనీర్లు తమకు తెలీదని చాలా విషయాలు వొప్పుకుంటారు. పోనీ, లాయరుకీ, కలెక్టరుకీ బ్రిడ్జీ కట్టడం తెలీదు. షాపువాడికి "టిగ్నామెట్రీ" తెలీదు. కాని ఒకానొక విషయమై వైద్యంగాని, పాలిటిక్సుగాని, సంఘ సంస్కారంగాని, ఉత్తర సముద్రయానం గాని, "రెలిటివిటీ థియరీ"గా గాని తనకి తెలీదని వొప్పుకున్న పత్రిక వున్నదా!

బోధనలు రెండు విధాలు-తాను నమ్మినది బోధించడం, — తాను నమ్మనిది బోధించడం — తాను నమ్మినది బోధించేవాడు — 'సిన్‌శియరుగా' తన కారణాలు చెప్పి నచ్చిన వాళ్ళని వొప్పుకోమంటాడు, రెండోవాడు కుయుక్తులు పన్ని తప్పుడు ఆర్గ్యుమెంట్సు పెట్టి ప్రజల్ని తనవేపు తిప్పుకోచూస్తాడు. పత్రికలీజాతివి. మొదట పత్రిక పాలసీకి మెదడునీ, నిజాన్ని అమ్ముకుంటారు. కనుక అన్ని వార్తలను వక్రం తిప్పడం అలవాటవుతుంది. దాంతో తమ వుద్దేశాలను కూడా వక్రంచేసి అబద్దాల్ని నమ్మడం మామూలవుతుంది. ఒక విషయంలో తాము కాంక్షించేది ప్రజలచేత నమ్మించడం కోసం తక్కిన విషయాల్లో. ప్రజల వుద్దేశ్యాలెట్లా ఉన్నాయో వాటికి రుచించేటట్టు రాస్తారు. అన్ని సంగతులూ ప్రజలు యిష్టపడేవిగా వుంటే తమపార్టీకి ముఖ్యమైన అభిప్రాయాల్ని ఆ "చక్కెర"లో ఆ మందును తెలీకండా మింగించవొచ్చు.

ప్రపంచంలో మొదటి పుస్తకాలు మత సంబంధమైనవి. అందువల్ల ప్రజలకు అచ్చుమీద భక్తి పురాతనంగా వొస్తోంది. ఈ ప్రకటనలవల్ల మోసపుచ్చటానికి అందువల్లనే యింతవీలవుతోంది వర్తకులకూ, పత్రికాధిపతులకూ.

"ఆవుకి కుక్కపిల్లలు పుట్టాయి."

"ఛీ!"

"నిజం కాకపోతే పత్రికలో అచ్చువేస్తారా!"

యిట్లాంటి సంభాషణ లనేకసార్లు వింటో వుంటాం. కావలసి చేసే మోసంకాక యీ పత్రికల్లో రాసే ముఖ్యుల బుద్ధిహీనతల వల్ల అనేక పొరబాట్లు పడుతోంటాయి. అర్థనా చదువూ, కానీ లోకానుభవమూ గల మనుషుల్ని అరగానీ జీతమిచ్చి పత్రికలకి ఎడిటర్లుగా పెడితే వారు అభిప్రాయ సార్వభౌమపీఠాన్ని అధిష్ఠించి కలానికి అడ్డంలేకుండా చలాయిస్తారు. కనుక ప్రజల్ని యీ పత్రికలవల్ల మోసపోకుండా ఎడ్యుకేటు చెయ్యడం వివేకవంతుల విధి.

ప్రజాదరణమీద ఆధారపడ్డవి గనుక యీ పత్రికలు (నటకుల వలెనే) ప్రయత్నించికూడా ఉన్నతాదర్శాలను నిలుపుకోలేవు.

వుదాహరణం :— ప్రజామిత్ర ఒక సంచికలో—ఇట్లా ఉంది.

"విచిత్రపు భర్త."

"ఒక భర్త తన భార్యను ప్రేమించి వదిలిన వాడిపై దావా వేశాడు. నాగరికతలో మిట్టిపడుతున్న ప్యారిస్ నగరంలో" అని వేశారు.

మొదటిభాగం వార్త. రెండో భాగమున్నూ, హెటిలున్నూ ఎడిటరు గారి వ్యాఖ్యానం.

ఈ వార్తనే ఏ వ్యాఖ్యానమూ లేకుండా నేను కొంతకాలం కిందట ఇంగ్లీషు పత్రికలో చదివాను. చదవగానే నేననుకున్న దేమంటే-ఆ భర్తకి, ఆ భార్యమీద ఎంత బలీయమైనదీ, వున్నతమైనదీ, ఐన ప్రేమవుండి వుండాలో అనుకున్నాను. నే ననుకొన్నది ప్రజాభిప్రాయానికి విరుద్ధం—ఎడిటరుగారి ఆ వ్యాఖ్యానం ప్రజానుకూలం. ఎందుకు? ఎంత తాను ప్రేమించిన స్త్రీ ఐనా, తమను ఏ కారణం చేతనైనా వొదిలిందా పురుషుడు ఆమెను ద్వేషించాలి, ఆమె ఎంత నాశనమైతే అంత తాను సంతోషించాలి.



ఆమెకు కష్టాలు కలిగేట్టు తాను ప్రయత్నించాలి. ఎవడితో వెళ్ళిపోయిందో వాడు ఆమెను హింసించి నాశనంచేస్తే పురుషుడి 'పొయెటిక్ జస్టిసు' అహంభావం. కసి సంతుష్టి పొందుతుంది. అంతేకాని ఆమె తనని వొదిలిన తరువాత కూడా ఆమె శ్రేయాన్నే కోరాడా—సామాన్య మానవుడికి వాడి సంగతి అర్థంకాదు. వాడు 'విచిత్రపు భర్త.'

భార్యయొక్క ప్రియుడిమీద దావా వేసేందుకు భర్తకి ఏమి 'మోటివ్' వుంటుందా అని యోచించరు. యోచించే అన్ని 'మోటివ్స్' లోకీ నీచమైనదే, 'స్కాండలస్' అయినదే తోస్తుంది మనసుకి - అట్లానే ప్రజలకు కోపింపజేసి వారి అభినందన కరతాళధ్వనులు వినాలని ప్రయత్నిస్తారు.

ఇంక తప్పుడు ఆర్గ్యుమెంట్లకు ఉదాహరణ చూపుతాను.

జన్మనిరోధం విషయమై ఆంధ్రపత్రికలో ఇట్లా 'ఆర్గ్యూ' చేశారు.

'భగవంతుడే ఆర్థిక నిర్మాత.'

'దేశము ఆర్థికముగ....అభివృద్ధియగుట యెట్లో తగిన ఉపాయము ప్రభుత్వమువారాలోచింప వలెనని కోరతగును.'

'భగవంతుడొక్కడే జనన మరణముల శాసించునని నమ్మకము గలిగిన యెడల .. ఆందోళన మనవసరము'

'జనసంఖ్య యెక్కువ కాకుండా కట్టివేయవలెనని కోరుట హాస్యాస్పదముగ నున్నది.'

అర్థానికీ, జనానికీ, భగవంతుడే అధికారి, కాని ఆర్థికాభివృద్ధి ప్రభుత్వంవారికి చాతనవుతుంది. కాని జననముల విషయమై చాతకాదు. చూశారా! ఈ ఎడిటర్‌గారి సర్వజ్ఞత! ఆయన హేతువాదాన్ని యెట్లానాశనం చేసిందో!

వాదనలేదు గనక మసిపూసి దొంగ వాదనలతో పత్రికను నమ్మి చందాయిచ్చే ప్రజలకు చేసే ఉపకారం యిదీ.

ఇంకా 'ఈ దేశమున కీతత్వము (సంతాననిరోధనం) చెల్లజాలదు. భారత సంప్రదాయమునకు తగినవికావు.'

'భారత సంప్రదాయము' ఎక్కడన్నా నిర్ణయింపబడి సిద్ధంగా వుందా, ఆంధ్రపత్రిక ఆఫీసులో నిర్ణయిస్తున్నారా? శిశు హత్యలూ, గర్భస్రావాలూ, రహస్య వ్యభిచారమూ, భారతదేశ తత్వానికీ సంప్రదాయానికి తగినవి గనక, వాటిని మాన్పే ప్రయత్నాలు ఆ సంప్రదాయానికి వ్యతిరిక్తములు కావా? మరి ప్రౌఢ వివాహాలూ, అస్పృశ్యతా నివారణా భారత సంప్రదాయాలేనా?

ఆంధ్రపత్రికను యీ భారత సంప్రదాయ నిర్ణయ పీఠానికెవరు అభిషిక్తుల చేశారో తెలీదు.

ఇంకా 'కామసూత్రమును పఠించిన వారీ మార్గం తలపెట్టనక్కర లేదు' అంటే ఏమిటి?

కామసూత్రాల్లో సంతాన నిరోధక మార్గాలున్నాయా? ఈ ఎడిటర్కి కామసూత్రాలూ తెలీవు, నిరోధక మార్గాలూ తెలీవు. వుత్త బూటకం. ఆ రెంటికీ ఏమి సంబంధం? వుంటే చెప్పరాదా?

మళ్ళీ కింద—'సత్సంతానముల బడయవొచ్చును.'

సంతానం వొద్దో అనేవాళ్ళకి సమాధానం రాస్తో. యీ చెప్పే హేతువేమిటంటే సత్సంతానమును బడయవొచ్చునని. ఇంతకన్న స్టుపిడిటీ తలుచుకోగలమా?

'విశ్వవిద్యాలయములలో సంతాన నిరోధ శాస్త్రమును' నేర్పకూడదని ఒక్క కలంపూపుతో శాసించారు. ఎందుకు నేర్పకూడదని నేమ రాని ప్రకటించమంటే మారు పలకరు. అందుకు తగిన అస్త్రములను నిర్మించకూడదట. ఎందుకు?



దీనికంతా మూలం 'పెట్టీ జెలసీ.' మెద్రాసు నగరంలో ధర్మంగా పారేసినట్లు పారేసే యిరవై రూపాయల జీతంతో యేపేటా భార్య కనే పిల్లల్ని పోషించుకోలేక సకల బాధలు పడుతో—ఈ జన్మ నిరోధజ్ఞానం కలిగితే ఇతరులు ఆ బాధలనుంచి తప్పించుకుని సుఖపడతారని కడుపు మంట-అందుకని జ్ఞానాన్ని ప్రచారం కానీరు. కామ సూత్రమును పఠించిన ఆ యిరవై రూపాయల జీతంగల విలేఖరికి అంతమంది పిల్లలున్నారేం?

ఇంకా రాశారు 'చావు పుటుకలు మానవుల చేతులనున్నట్లు అర్థిక వేత్తలు పల్కుమాటలు—'

మానవుల చేతుల్లో లేవా? సంతాన నిరోధ పద్ధతులు వొచ్చిం తరువాత అనేక దేశాల్లో జనసంఖ్య ఎట్లా తగ్గిందో తెలీదు, యీ సర్వజ్ఞులకి. చచ్చిన చిన్న కీటకాల్ని, మృగాల్ని బతికించే సంగతి విన్నారా యీ త్రికాలవేదులు? అనేక దేశాలలో జీవితకాలం వృద్ధి చేశారని, తల్లులకు ఆరోగ్య పద్ధతులు నేర్పి శిశు మరణాలు తగ్గించారని, లెక్కలు చూపి, తల పుర్రెల్లోకి యెక్కించినా నమ్ముతారా వీరు?

మరి ఆరోగ్య వారాలూ, శిశు మందిరాలూ వృథా అని బోధించరేం? మరణం మానవుని చేతిలో లేదట! కొంచెం పొటాసియం సైనేడ్ తిని చూడరాదూ చప్పున అర్థమౌతుంది? వీరు చదువరు — యీ ఎడిటర్లు— చదివినా గ్రహించే తెలివీ, సంస్కారమూ లేవు - పాపం!

తమ తరము ఎరగక, పత్రిక చేతిలో వుందికదా, ప్రజలు మూర్ఖులు కదా, ప్రజల్ని యింకా మూర్ఖంగా నొక్కిపెట్టాలని, యీదొంగ సంస్కార సనాతనులు చేసే యీ ప్రచారం చాలా అయోగ్యమైనది. నీతీ, ధర్మమూ, యీశ్వరుడూ, సంప్రదాయమూ, దేశాభిమానమూ, అనే దొంగ మాటల్ని విరివిగా వుపయోగించి, యీ పవిత్ర దుర్మార్గులు సంఘానికి చేసే అపకారం అపారమైనది.

ఇంతకీ వీరి అభ్యంతరమేమిటి? — అసలు ? తక్కిన మార్పుల వొప్పుకున్న, వీరి రాజకీయ గురువులు - కొన్ని వారికే అర్థంగాని కారణాలవల్ల — యీ సంతాన నిరోధాన్ని వొప్పుకోలేదు. వొప్పుకుంటే, యిదీ సంప్రదాయాలలో చేరేదే! ఈ ఎడిటర్ల పిల్లల్ని భగవంతుడేనా కంటోంది? పాపం! మనుష్యావతారం ఎత్తి కాదు కద ?

పుటకలకి ఆపరేషనులు మానరు, చావకుండా మందులు మానరు. అవి పురుష ప్రయత్నాలుట. ఈ సంతాన నిరోధమూ పురుష ప్రయత్నమే! శుష్క వేదాంతాలు ప్రచురించే భీరుల ప్రయత్నం కాదు, ఇట్లాంటి వాళ్ళకి భయపడని ధీరుల ప్రయత్నం.

శిశువుల మరణవేదనా, తల్లుల ప్రసవవేదనా, రోగాలూ, దీద తనమూ, పిచ్చీ, మాంద్యమూ, వియోగాలూ, మరణాలూ, దెబ్బలూ, చూసి చూసి ఈ దారుణాలతో ఈశ్వరుణ్ని సమన్వయించుకోలేక, యీ బాధలు పోగొట్టుకునే మార్గాలాలోచిస్తే, ఆ ఈశ్వరుడికి కోపమెందుకో ? అర్థం కాక నా వంటివాడు, ఈశ్వరుడి సంగతి తెలుసుకొని రాసే ఈ ఎడిటర్ జోటివాళ్ళని ప్రశ్నిస్తే వారు, భక్తిసూచనగా కళ్ళు పైకి తేలవేసి చేతులు ముకుళించి, ఈశ్వరేచ్ఛ! అంటారు. లేక 'కర్మ' అని పళ్ళు కొరుకుతారు. ఇంక ఎక్కువ ప్రశ్నించామా, 'పాపాత్ములు, పామరులు, పాశ్చాత్య నాగరికతా వ్యామోహ ప్రమత్తులు' అని చీదరించుకొని కాళ్ళు కడుక్కొని, స్నానం చేస్తారు. ఈ శిశువులకీ తల్లులకూ ఎక్కడ బాధ తగ్గిందో అనే భయంతో, తమ నీతి జనితరోగాలూ, విషాదాలూ, ఘోరాలు ఎక్కడ నాశనమౌతాయో యని తప్పువాదనలతో పత్రికల్ని నింపి మోసగిస్తారు.



# కవిత్వం దేనికి?

'బ్రాలమా, అవో హమారే గేహరే'

అని కె. సి. డె. పాడుతున్నాడు, కాఫీ హోటలు గ్రామఫోనులో గొప్ప పాటకుల రికార్డులు ప్రతివాళ్ళకీ అమ్మకూడదని ఒక శాసనం వుంటే బావుండును.

బూతు కవిత్వం అనేదానిమీదా, చిత్రాలమీదా వుండే ఆంక్ష, అందమైన కవిత్వాలకూ సంగీతాలకూ గొప్ప చిత్రాలకూ వుంటే బావుంటుంది. నోటినిండా యిడ్లెన్లు కుక్కుకునే హోటళ్ళలో, పేకాటలో కొట్టుకోడానికి సిద్ధమౌతున్న 1943 నాగరికుల క్లబ్బుల్లో, మ్యునిసిపల్ ఎన్నికల ప్రచారాలలో, సినిమా చెమటల్లో కంపులో, డి.కె.రాయినీ కరీమ్‌ఖానుని వినిపిస్తారు. ఈ దివ్య గాయకులు, గ్రామఫోను పళ్ళాలలో చిక్కుకుని, పాడడానికి నిరాకరింపలేరు. మనుష్యులకూ మనస్సులకూ అందరాని స్వర్గానుభవం- ఎంత చులకనా చవకా అయిపోయింది, సినిమాలవల్లా, రేడియోల వల్లా.

డెమాక్రసీ-అంతకన్న సోషలిజం, ప్రజలనందరినీ సమానుల్ని చేశాయి. కాని చెయ్యగలవా అని అనుమానం. అందమూ, ఆనందమూ, అనుభవమూ, ఎవరి స్వంతహక్కు కావంటున్నారు. కాని సౌందర్యానుభవాన్ని, అనుభవయోగ్యతనీ, ఏ పద్ధతీ ఏ పంపుడూ, ఏ విద్యా, ఏ సమానత్వమూ తీసుకుని రాలేవు. భాగ్యాలూ, భోగాలూ పంచుతాంకాని, విలువ

గల కళా పదార్థంనించి ఆనందం పొందగల సంస్కారాన్ని ఎవరు పంచగలరు ?

అన్నిటికన్న విలువైన ఈ సబ్జెక్టివ్ వాల్యూస్ ఎవరూ పీరరాని, పొందలేని భేదాలు మనుష్యుల్లో వున్నాయని గమనించరు. లక్షరూపాయల షావుకారునిచూసి ఆగ్రహపడతారు గాని, బూజుగదిలో, మూలుగుతో పడున్న కవి మనో ఆకాశంలో కలిగించుకుంటున్న విచిత్ర తేజస్సౌధాలని చూసి ఈర్ష్యపడే తెలివి కూడా లేదు ప్రజలకి.

ఇరవై మంది భోగస్త్రీలతో ఊరేగే జమీందారుని చూసి మంటగాని, తను ప్రేమించిన స్త్రీ కళ్ళలో లోకాలు చూస్తున్న చిత్రకారుడి అనుభవం ఎవరికీ తెలీదు.

'కళ ఎవరి సొమ్మూ కాదు' నిజం. అనుభవించే దృష్టిగల ఆర్టిస్టు సొమ్ము కళ. ఎంత పంచుకున్నా నీదీ కాదు. ఇదీ వసంత కాలమని అద్భుతమైన రంగులతో ఉదయ సాయంత్రాలు ప్రతినిత్యమూ ఆకాశాన్ని అలంకరిస్తున్నాయనీ, ఆ అలంకారం మన హృదయాల కోసమనీ, ఇదీ చదివేవారు ఎందరు గుర్తించారు? పిలిచి పలకరించి, దుమ్మునీ, చెత్తనీ పీడమొహాల్నీ వెలిగించే యీ కాంతులకు అంధులైన సోదరులే, గడ్డి ఆకు వెనక సిగ్గుతో వాదిగే పువ్వుని చూసి మురిసే ఉన్మత్తుడి ఆనందాన్నికూడా పంచుకోలేకపోతిమే అని దిగులు పడేది.

పైగా, 'లోకమంతా ఆకలితో మాడుతో వుంటే, నీ కవిత్వం ఎవరికి కావాలయ్యా!' అంటే.

'ఆకలి తీర్చుకోడం తప్ప, ఇంక ఏమీ పనిలేని వాళ్ళకి కాదయ్యా! ఈ కవిత్వం ! ఆకలి తీరి కూడా, ఆకలి వుండి కూడా, ఇంకా దిక్కులు వెతికేవారికి' అంటాను,



ఆకలి తీర్చుకోడమే నీ జీవితానికి ముఖ్యమైన అవసరమైతే.... ఈ ఆకలిగొట్టులు అందరూ, ఏ కామ ప్రోత్సాహంవల్ల జన్మ నెత్తారు.... ఆ ప్రోత్సాహంలో కొంత సౌందర్య భావమన్నా, ప్రేమాకర్షణన్నా ఉండి వుంటుందని నమ్మి నేను పాడుతున్నాను అంటాడు కవి.

లేదంటారా... ఉత్త సృష్టి ప్రోత్సాహమే—భోజన శక్తేనంటారా జన్మకి కారణం? పాపం! ఏం చెయ్యను!

అమూల్యమైన సంగీతం, ఎంతో కష్టపడి యాత్రలు చేస్తేనేగాని లభించని కళానుభవం, ఎంత చులకనై పోయింది! నమ్రతతో నమస్కరించవలసిన సౌందర్యం-గోడలమీద-అట్టమీద-వంకర్లు తిరిగి- నగం చిరిగి దస్కత్తులతో-సందేశాలతో-ప్రతి కాళ్ళకిందా—కళ్ళకిందా.... మోటారు కూతలమధ్య, పందుల గురగురలో కలిసి, వేడి వేడి శనగపప్పు అమ్మకాలతోబాటు, రేడియోలోంచి హరీన్ చటర్జీ పాడుతున్నాడు.

ఆర్ట్ ఫర్ ఆర్ట్స్ సేక్ అనేది నిజం అయినా, కాకపోయినా, కళలవల్ల ప్రయోజనం సాధించాలన్నా, కళవల్ల నిజమైన కళవల్ల సాధించే ప్రయోజనాలు చాలా ఉన్నతమైన ప్లేనులో వుంటాయి.

'ఎందుకండీ ఈ కవిత్వం, ఈ కథలూ!'

'ఎందుకూ లేదండీ, చదవకండి' అంతే జవాబు.

ఎందుకు అని ధిక్కరిస్తే, వస్తాదులూ, కొండరాళ్ళూ, ఎలుగుబంట్లూ జవాబు చెపుతాయి—కాని దక్షిణ వాయువూ, వెన్నెలరాత్రీ, మిణుగురు పురుగూ, జవాబియ్యవు.

★

# సినీమా జ్వరం

మనుషులకోసం కళా, కళకోసం మనుషులా? రెండు కక్షిల అభిప్రాయాలు వున్నవాళ్ళు వున్నారు, అసలు అభిప్రాయాలులేని తొంభై తొమ్మిదీ వినా. మన సినిమాలలో కళలేని లోపం కళ్ళు చెదరకొట్టే కాంతి తీరుస్తోంది. కళ కొసరమైన మనుషులు లేరు; కళ అంతా మనుషులకోసమే గాని, ఇంక దేనికోసరం వున్నారు? అని వాళ్ళని ప్రశ్నిస్తే 'తిండికోసం, హెచ్చు ఏది లభిస్తే దానికోసం' అని నిర్మొహమాటంగా నిజం చెప్పుకుని, సినీమా కళా, సినీమానీతి అని యీ అబద్ధపు రాతలు రాయకపోతే చాలా బావుంటుంది, సినీమా ప్రస్తుతం చాలామందిని పోషించే వృత్తి. ధనాన్ని ఒకచోట నిలవనీక ఎక్కడో తాతలు గోతుల్లో, బాంకుల్లో పూడ్చిపెట్టిన దాన్ని తవ్వించి, సినీమావాళ్ళ జేబుల్లోకి, అక్కణ్ణించి అతి త్వరితంగా వర్తకుల దగ్గరికీ, పరిగెత్తిస్తోంది కటికదరిద్రుల దగ్గర్నించి దమ్మిడీలు పోగుచేసి ఎడ్వెంచరర్స్ వాళ్ళో పోస్తోంది. తాగుడుమాన్పి బీదవాళ్ళ సంసారాలని వుద్ధరించాలని చూసేవారికి సినీమా తీవ్రంగా తోడ్పడింది. 'ఏకర్చూ చెయ్యకండి. తాగుడు, వేశ్యలు, కట్నాలు, జూదం, ఇవన్ని మాని డబ్బు కూడపెట్టండి' అని, బిగ్గిరిగా అని; కంఠం మార్చి మెల్లిగా, 'అదంతా నా వాళ్ళో పొయ్యండి' అంటోంది సినీమా కళావంతురాలు.

వృత్తులు దుర్భరత్వంలో ఒకదానికి ఒకటి తీసిపోవు. అవి తమ సేవకులకు చేసే చెరుపుల్లో ఒక్కొక్కటి ఒక్కొక గుణం 'స్పెషలైజ్' చేస్తున్నాయి. ఈ కొత్త సినిమావృత్తి అప్పుడే తన నాశన ప్రతిభని



గొప్పగా బైటపెట్టింది. సమస్త కళలకి సమ్మేళనం గనక, వివిధాలైన వృత్తులన్నిటినీ అవసరం చేసుకుంది సినిమా గనక, అన్నిటినించీ వాటి స్పెషల్ మరణ గుణాల్ని తీసుకుని కేంద్రీకరింప చేసుకుని పనిచేస్తోంది.

వర్తకం, జర్నలిజం, కవిత్వం, ప్లీడరీ, ఉపాధ్యాయత్వం, సోమరితనం, భూస్వామిత్వం, వేశ్యాత్వం, సంగీతం, మధ్యవర్తిత్వం ఇంకా ఎన్నో పూర్వవృత్తులలోంచి లాక్కొచ్చింది ప్రజల్ని సినిమా. రెండు మూడేళ్ళల్లో వీళ్ళందరూ ఒకటే రకంగా తయారైనారు. చాలా విషయాల్లో వివిధ వృత్తుల వాళ్ళు, కులాలవాళ్ళు, గుణాలవాళ్ళు, అభిరుచులవారు, సమస్తమైనవారూ మోసంలో, అబద్ధంలో, మొహం తప్పించడాలలో, డబ్బు కాజెయ్యడాలలో, పని గడిపించుకోడాలలో, నిర్దయలో, మొదటి బహుమతులకోసం తీవ్రంగా పోటీ చేస్తున్నారు. ఇంకా చాలా గుణాలు చూస్తున్నాం కాని, అవి యీ గుణాలంత సర్వసామాన్యం కాదు. అవి ప్రత్యేక పరిస్థితులవల్ల సంపాయించుకున్న గిఫ్ట్స్ కావొచ్చు. చాలా సమ్మకస్తులు, స్నేహితులు, కవిత్వం, నాజూకుతనం, నిజంగా హృదయం కల వాళ్ళు. చాలా మార్దవమైన హృదయం కలవాళ్ళు, అభిమానధనులు కొన్ని నెలలు సినిమా పనిచేసి, అదృశ్యంగా మారారు గుర్తులేకుండా. కారణాలు వెతకడం నాకు అలవి కావటంలేదు. పాఠశాలలు ఎందుకు మృత్యుశాలలవుతున్నాయో కనిపెట్టలేని నేను, స్టూడియోలు ఏమిటో తెలీని నేను, ఎట్లా చెప్పగలను కారణం? నాకు ప్రియమైనవాళ్ళూ. నా గౌరవం పొందినవాళ్ళూ, ఐన మనుషుల మరణగీతం పాడవలసి వొచ్చిందనే బాధ ఒకటే తెలుస్తోంది.

కొద్దిరోజుల కిందటిదాకా, ఈ సినీమా ప్రజ్వలించిందాకా, భావకవిత్వానికి వుండేవి యిట్లాంటి గుణాలు. ప్రజాదరణ తగ్గి, అవి అక్కడ

ఆశ్రయం జారిపోయి, పదిరెట్లు బలాన్ని పొంది, సినిమాలలో ప్రవేశించాయి. స్టూడియో వాతావరణాన్ని పూర్తిగా ముంచెత్తి, విజృంభించి, దూరంగా వున్న పూళ్ళమీద, కాలేజీలలో, యిళ్ళల్లో ప్రవేశిస్తున్నాయి.

ఇది ఒక కొత్తరోగం - యీ సినీమాజ్వరం, ఏదోవిధాన సినిమా పరిశ్రమలో చేరాలని, ఆ అదృష్టం లభించే పర్యంతం, పాత్రలని అనుకరిస్తో వుండాలని, ఆ పాటల్ని కూనిరాగాలు తీస్తో వుండాలని, వాటిసంగతే చదవాలని, వినాలని, మాట్లాడాలని దాహం, అశ్రెస్ట్. ఇవి కొన్ని చిన్హాలు. వృత్తికోసం సినీమాలో చేరితే అర్థముంది. సినీమావృత్తి లభించని నిర్భాగ్యులకే తక్కిన వృత్తులు, వుద్యోగాలు, భూములు, మాములు, ధనంవున్న వాళ్ళకే, సుఖంగా జీవితం గడుపుతున్న వాళ్ళకే యీ జ్వరం. నాటకరంగం కోసం కూడా ఇట్లాంటి వ్యామోహం వుండేది. కాని అడియన్సుని మాస్తే భయం వుండేది: స్టేజీకీ ఆడియన్సుకీ పరస్పర సమీప సంబంధం వుండడం వల్ల నచ్చకపోతే, ఈలల దగ్గిర్నించి, తిట్లనించి, బెడ్డలూ, కుర్చీలూ, చెప్పులూ విసరడం దగ్గిరికి జరిగేది. ఇప్పుడు సెల్ఫ్ ఎక్జిబిషన్ కోర్కె పూర్తిగా తృప్తిపడుతూ, దానివల్ల కలిగే యిబ్బందులు తప్పిపోయినాయి సినీమాలవల్ల. ఏ దూరం పూళ్ళలోనో అడవుల్లోనూ షూటింగులు జరగడంవల్ల ఇదివరకు భయపడే స్త్రీలకికూడా ఇప్పుడు ధైర్యం కలుగుతోంది. పతివ్రతలు తాము గావాలనే కోర్కెపోయి పతివ్రతల వేషాలు ధరించాలనే కోర్కె హెచ్చింది, ఆ పురాణ పతివ్రతలలో చాలా లోపాలున్నాయి, వాటిని అనుకరించకండి అని రాసినప్పుడు, మా పతివ్రతల్ని చెరుస్తున్నారని గోలపెట్టిన వాళ్ళందరూ, ప్రస్తుతం ఆ పతివ్రతలందరూ ఎట్లాంటి రూపాల దిక్కులేక తిరుగుతున్నారో గమనించారేమో! సీత, దమయంతి, సావిత్రి, అని అనండి, వెంటనే ఆ వేషాలు ధరించిన వేశ్యలపేర్లు తలుస్తున్నారు అసలు ఆ వేశ్యల పేర్లతోనే పిలుస్తున్నారు పతివ్రతల్ని. పతివ్రతల అసలు, కథలు మరిచి, సినీమా అవసరాలకు వంకరతిప్పిన కథల్నే



నిజం కథలకింద చెప్పుకుంటున్నారు. అసలు పతివ్రతల్ని అనుకరించమని యీనాడుకూడా నా పవిత్ర సోదరులు, దేశబాంధవులు, ఇంకా రాస్తోనే వున్నారు! చీర అంచులనించి జడలకొసలవరకు. శిగలోపూలనించి, చెవులో లోలకుల వరకు, బెదురుచూపుల నించి నంగిమాటల వరకు ప్రతి అక్షరమూ అనుకరిస్తున్నారు. అంటరానివారిని దూరంగా తరిమిన వేశ్యల్ని, వేశ్యాతుల్యుల్ని, ప్రత్యక్ష పతివ్రతలు వాళ్ళే కనుక, పూర్వపు పతివ్రతలు నవీన యువతులమీద కనికరించి సాక్షాత్కరించారని, పూజిస్తున్నారు. బాహ్యాడంబరాలు మతంలో, నీతుల్లో బాగా అలవాటైనవారుకద ప్రజలు!

ఈ ఉపద్రవాన్ని చూసి సహించలేక, ముసలి వితంతువులు తామూ సినీమాలలో చేరి వాటిని సంస్కరణ చెయ్యాలని ప్రయత్నిస్తున్నారు.

ఏదో చదువుకున్నవాళ్ళూ, మీ అభిప్రాయం ప్రకారం హై కారక్టర్ ఉన్నవాళ్ళూ కులస్త్రీలూ వెళ్ళి సినిమాల్ని మార్చి ఉద్ధరించబోతున్నారని ఆశించకండి. వెళ్ళినవాళ్ళ పేర్లు జ్ఞాపకం తెచ్చుకుంటే చాలు. దేశం నమ్మిన కళారాధకులు యాచకులూ, ఛత్రాజాలూ ఐపోయినారు. కళే యీశ్వరరూపం అని గొప్ప ఉపన్యాసాలిచ్చేవాళ్ళు కళని పాతిక రూపాయలకు అమ్ముకుంటారు. మతాన్ని అట్లా అమ్ముకునే ఈ గతికి వొచ్చారు ప్రజలు.

మతులు పూర్తిగా పోయినట్టు ప్రవర్తిస్తున్నారు. ఈ దరఖాస్తుదార్లు స్క్రీన్ అస్పిరెంట్స్. లావువాళ్ళు, దబ్బమొహాలవాళ్ళు. కంఠం లేనివాళ్ళు కళ అంటే ఓనమాలు రానివాళ్ళు వెమికలపోగులు ప్రతివాళ్ళూ, తగుదుమూ అని యోచనలేకుండా, ఎప్పుడూ ముఖం అద్దంలో చూసుకోనట్టే: తమ ఉచ్చారణ తాము విననట్టే ప్రవర్తిస్తారు. ఏమిటి? నేను బాగాలేనూ? వాడు నాకన్న బాగా వున్నాడా?

ఏమిటి? నా కంఠం బావుండదా? దాని కంఠం .... ఇంతకన్న బావుందా?

ఇదీ వరస.

సాధారణ విషయాల్లో వుండే వివేకం సినిమావిషయంలో పోతోంది ప్రజలకి. ఈ జ్వరం యేదో కొత్తగనక, విజృంభించింది. త్వరగా తగ్గుతుందనుకోడానికి వీలులేదు. హాలీవుడ్‌లో ఏం తగ్గింది?

సినిమాలో పని దొరకకపోతే స్టూడియోలో వూరికే పనిచేస్తారు' భోజనం పెడితే చాలు, ఇంటిదగ్గిర్నుంచి డబ్బుతీసుకొచ్చి పనిచేస్తారు. అదీ వీలులేకపోతే వూరికే ఏదో పనివున్నట్టు, తారలకు కాఫీలుతెచ్చీ, జోళ్ళు తుడిచీ, కొంగులు దులిపీ, సంతృప్తి పొందుతారు. దూరంనించి వెన్నల మోసుకుపోయి ఇస్తారు. అనవసరపు 'లా' సలహాలిస్తారు. చీరెలు అమ్ముతారు వాళ్ళకి.

సినిమా కాంతి తెరమీదనించి తీసేసినా, యీ మనుష్యులు కళ్ళలోంచి తీసెయ్యడం కష్టం. కాకపోతే, మొన్నటిదాకా, ఎవరూ తలెత్తి చూడని సాధారణులకోసం, కార్లు పట్టుకుని జోహారు లెందుకు చేస్తారు సినిమాలో కనబడ్డంత మాత్రాన: ధనంకాదు, రూపంకాదు, పాటకాదు-యీ ఆకర్షణ శక్తి సినిమాకి మాత్రమే చెందిన విషయం.

క్షుద్రనీతులనుంచి ఉన్నతమైన నీతికి కళ్ళు తెరవమనే చలం పుస్తకాలు చదవకండా యింకా యువకుల్ని అడ్డ పెడుతూనే వున్నారుగాని, పోస్టులో పుస్తకాలు పోష్టునించి కాజేస్తున్నారుగాని, నీతి అంటే యింతేనా, అని నీతిని అతి చవకచేసే చిత్రాన్ని చూడకుండా ఆపగలుగుతున్నారా? చలం మీ నీతిని అవినీతి అంటే, చిత్రాలు మీ అవినీతిని నీతిఅంటున్నాయి. మీ అంతరాత్మలకి చక్కనివేసలైన్ పూస్తున్నాయి. కొన్ని యేళ్ల గడిస్తేనే



గాని తమని ఎక్కడికి చిత్రాలు తీసుకువొచ్చి వొదిలాయో, ప్రజలు కనుక్కోలేరు.

ఏ కళాకూడా, కళాకారుడికి ఆత్మ ఇంఫ్లూయెన్స్‌నించితప్పుకోలేదు, మన సినిమా కళని కల్పిస్తున్న ప్రజల ఆత్మాభివృద్ధి, నైతికౌన్నత్యం, కళా పరిణామం, చిత్రాలలో, కథల్లో, మాటలలో, చూపులలో, చేష్టల్లో, సెట్టింగులలో వ్యక్తం కాకండా ఎట్లావుంటుంది? కాంషస్ లెవిల్‌ల్లో గోచరించకపోయినా, అంతకన్న బలియము ముఖ్యమైన మన సబ్కాంషస్ తాగుతోంది ఆ మురుగుని.

షేర్లు పోగుచెయ్యడం మొదలు ఆత్మవంచనా, పరవంచనా, కాంపిటేషన్, ఒకర్ని ఒకరు కిందకి తొక్కాలనే ప్రయత్నం, కీర్తిమీద ధనం మీద అమితమైన కాంక్ష, ధనం పోగు కావడమే ఆశయం, ప్రజల్ని ఏ దేవుళ్ళవల్ల, ఏ దేశభక్తిద్వారా, కొల్లకొడదామా అని యోచన, అధనమే వొస్తుందని రూఢి ఐతే. ఎటువంటి దాన్నీ వెక్కిరించడానికీ, అసహ్యం చెయ్యడానికీ, చవక చెయ్యడానికీ సంకోచం లేకపోవడం, యాచన, పొగడ్తలు, నాయికా నాయకత్వాలు సంపాయించడానికి ఏవిలువల్నీ ధ్వంసం చేసుకోడానికి జంకకపోవడం, పరస్పర యీర్ష్యలు, కుట్రలు- ఇదీ సినిమా వాతావరణం. అక్కడ ఆరునెలలు నాని తయారైన సిలలాయిడ్‌కి ఆ గుణం పూర్తిగా ఇంకివుండదూ!

అక్కడి మనుషులు మనకన్న దుర్మార్గులనడంలేదు, మన అందరిలోనూ ఎక్కువ తక్కువలుగా వున్న క్షుద్రత్వాన్ని బైటికిలాగి వృద్ధిచేసే గుణం సినిమా వాతావరణంలో విజృంభించి వుందంటున్నాను. ఎంత రంగులకింద, చీరల కింద, మంచిమాటలకింద: సినిమా పత్రికలో ఆదర్శ వ్యాసాల కింద, దాచినా, ప్రకటనశక్తి మానదు. సినిమాజ్వరం లేని మను

షులకన్నా, ఎంత వున్నతమైన ప్రేమ చూపడానికి ప్రయత్నిస్తేనేం, అది ఆదర్శమే కావొచ్చు. తీరా పాత్రలని కల్పించి మాట్లాడించేప్పటికి, రాసే వాడి మనసు లెవెల్‌నే అందుకుంటారు పాత్రలు. పైగా ఆ కథ సినిమా అధికార్లకి నచ్చాలి. అకాకానీవాళ్ళకి అర్థంకావాలి. ఆ కథమీద డైరెక్టర్లూ, అతని మిత్రులూ, కొంత ఆత్మకళని వొలకబోస్తారు. దాన్ని అభినయం పట్టి, మాటలు హృదయంలో నానేసి తెప్పిస్తారు నటకులు. ప్రేమనిగురించీ పాతివ్రత్యాన్నిగురించి, వీళ్ళకివున్న అనుభవమూ, ఆదర్శమూ, అన్నీ చక్కగా వ్యక్తమవుతాయి ప్రజలకి. అదీ పురాణకథల రూపంగా, మధ్య మధ్య విష్ణు మహేశ్వరుల్ని ప్రత్యక్షంచేస్తే, దేవముని నారదుడిచేత వ్యాఖ్యానం చేయించడంవల్ల, స్త్రీల శీలమూ, పాతివ్రత్యమూ. అంటే ఏమిటో ఇదివరకు ఎన్నడూ అర్థంకానట్టు అర్థమవుతున్నాయి.

దేశభక్తి ఏకోశానా లేనివాడు ఎన్ని పద్యాలు పాడినా, దేశభక్తి పుట్టించగలడా చూసేవాళ్ళలో? చివరికి ఉత్త వార్తలురాయనీ, సంస్కారం ఉన్నవాళ్ళు రాసిన దానికి, అర్థజా కూలియాచకులు రాసేమాటలకీ ఎంతో భేదం కనపడుతుంది.

ఫోటోలు, శబ్దం, నటన, అందం, డైరెక్షను, కథ, పాటలు, అన్నీ బాగున్న చిత్రాన్నిచూసి, హాలులోంచి, బైటికి రాగానే ఏదో మనసంతా అసహ్యమైనట్లు తోస్తుంది. సాధారణంగా లేని వికారాలు తోస్తాయి. బతుకు విలువమీదే సందేహం కలుగుతుంది. ఇది సోపరుల శ్వాసవాయువుల పీల్చడంవల్ల నేకాదు. ప్రధానం ఆ చిత్రనిర్మాతల ఆత్మవాయువులు చిత్రంలో నుంచి పీల్చడంచేత కలుగుతుంది.

కాపీరైటు చిక్కురాకుండా భద్రంగాపాటల్నీ కవిత్వాన్నిదొంగిలించడంలో తారలకాళ్ళు పట్టడంలో, తర్ఫీదైన యీ మహా పురుషులు సృజిస్తున్నారు, ప్రజ అప్యాయంగా తాగే ధర్మబోధని.



రాతా, చిత్రమూ, గానమూ, మొదలైన కళలు, అట్టే ఖర్చులేనివి గనక—మొండికెత్తి దీక్షతనంలో కళను సేవిస్తో మనుషులు బతకడమూ, ఆదర్శాలు చూపడమూ, కొంత ఔన్నత్యం సాధించి ప్రజల్ని ముందుకు నడపడం సాధ్యం అయేవి: కాని సినీమా లక్షలతో పని. ఎక్స్పెరిమెంట్లు ఏమాత్రం వీలుకేదు. ప్రజల మంచికాదు, ప్రజల కళాభిరుచి కాదు. ప్రజల జేబులమీద దృష్టి—లక్షలు ఖర్చుపెట్టే యీ కంపెనీల ధ్యాస అంతా అజ్ఞానులమీద—మహా ఐతే బేడలమీద, 'నీ బేడ నాకు కావాలి నీ బేడకోసం చూడు ఎన్ని తమాషాలు చేస్తానో! కెమేరాను చంకలకిందనుంచి తీస్తాను. పంచి ఆపరేషన్ గది చూపుతాను పెద్దపొట్టలవాళ్ళని గంతులేయిస్తాను. కొండమీదనుంచి దూకిస్తాను—రైళ్ళను ఢీకొట్టిస్తాను—అడవిలో మోటారుని ఇరికించి నాయికా నాయకుల్ని చీకట్లో వొదిలి వాళ్ళమీద పెద్ద వెలుతురు వేస్తాను. సైకిళ్ళమీద పాటలు పాడిస్తాను, కుర్చీళ్ళు ఎగరవేయిస్తాను. ఇంకా ఏం కావాలి? పత్రికలకి రాయి, అవన్నీ యీసారి చేయిస్తాగా! చాలామంది బేడలు చేతుల్లో ఎత్తి నాకు చూపితేచాలు? ముద్దులు అక్కర్లేదా మాన్పిస్తాను. కావాలా కురిపిస్తాను, పెళ్ళి చెయ్యాలంటారా! మంత్రాలతో సహా చేస్తాను. బ్రాహ్మలకీ హరిజనులకీ పెళ్ళిచెయ్యమంటారా? చేయిస్తాను. హిందూ మహమ్మదీయులకు పెళ్ళి చెయ్యవద్దంటారా? మానేసి వాళ్ళ ఖర్మానికి వొదులుతాను. ఏదన్నా ఓ కులాన్ని హేళనచేస్తే నీకడుపు నిండుతుందా? సరే కానీ. వేదం వినాలని వుందా? తయారు.'–అంటున్నట్టు వుంటుంది. బొమ్మ చూస్తున్నంత సేపూ బొమ్మ చూస్తున్నాం అనే ధ్యాస మాత్రం మరిపించలేరు-(ఒక బారువా తప్ప ఇంకెవరూ-అంటుంది సౌరిస్)

ముగ్గులువేస్తూ, రైలు కింద చస్తూ, ఘోర యుద్ధంచేస్తూ, పాటలు పాడతాం. అరణ్యాల్లో, మహాసముద్రాలమధ్య ఆర్కెస్ట్రా పలికిస్తాం. ఆకాశాల్లో దేవతలని అద్భుతంగా ఎగిరిస్తాం ముక్కోటిదేవతల్ని ముక్కుకి

తాడేసి లాగి మీముందు నుంచోపెడతాం. చదివినవాళ్ళను బతికిస్తాం. బతికిన వాళ్ళని చంపేస్తాం. మనుష్యుల్ని మృగాలుగా మార్చేస్తాం. పిట్టలచేత మాట్లాడిస్తాం. అన్నీ చేస్తాం.

మాకు అసాధ్యమయిందిలేదు. మేము కొత్తసృష్టి చేస్తున్నాం- అంటున్నారు డైరెక్టర్లు.

ఈ సినిమాజాడ్యం ముసలివాళ్ళ దగ్గర్నించి పసిపిల్లలదాకా గట్టిగా పట్టుకుంది. ఇకముందు అమితంగా వ్యాపించపోతోంది. ప్రతి మొహానికి సినిమాకళ పడుతోంది. పూర్వం యోగుల దగ్గిర కటాక్షంకోసం, ఏళ్ళ కొలది శుశ్రూషలు చేసినట్టు యువకులు, యువతులూ, డైరెక్టర్ల సేవ చేస్తున్నారు. 'ఛాన్సు' కోసం. 'ఎట్లాగో, ఒక్క-సారి రికమెండుచేసి చేర్పిద్దురూ, నేను పైకి పాకిపోతాను.' అనే ప్రార్థనలు అమితమై పోయినాయి. సినిమా చూసిరాగానే, ఆ ఫిల్ములోంచి బైలుదేరుతుంది గావును, పెద్దఆశాంతి పట్టుకుంటుంది. బ్రాందీమల్లేనే, మళ్ళీ మళ్ళీ వెళ్ళవలసిందే సినిమాకి. వెళ్ళి వెళ్ళి అనుకరించి, ఎన్నాటికో స్టూడియో గమ్యస్థానాన్ని చేరగలమని ఆశ.

'సరే, సినీమాలు ఇంత ఘోరంగా వున్నాయే అనుకుందాం. సినీమాలో చేరేవాళ్ళందరూ ఈ విధంగా విపరీతంగా అధోగతిలో పడుతున్నారనే అనుకుందాం. ఏం చెయ్యమంటావు ఇప్పుడు?' అని రాసినవాళ్ళె అడగడం సమంజసం.

కాని ఏం చెయ్యాలో నాకూ తెలీదు. నాకంటే చాలా బుద్ధిమంతులకి కూడా తెలీటంలేదు. సినిమాలు పోవాలని నా వుద్దేశ్యం కాదు. నేను సినిమాలు చూడకపోయినా, సినిమాలు లేకపోతే నాకేమీ తోచదు ముందు. నేనూ ఇంకా పదికోట్లమందీ కలిసి వాటిని పోవాలన్నా అవి పోవు-పోనివ్వరు. పోయినా లాభంలేదు. ఇట్లాంటి ఈవిల్స్ లోంచి మానవజాతి వడిచి, వాటిని గుర్తించి, మార్చి, ఉత్తమంగా చేసుకోవాలిగాని, బలవం



తంగా తాగుడు మాన్పించీ లాభంలేదు, సినిమాలు తీసేపీ లాభంలేదు: వేశ్యలమీద కత్తికట్టి ప్రయోజనంలేదు.

కాని సినీమాల నిజస్థితి ప్రజలకి విరివిగా తెలియచెయ్యాలి. స్త్రీలు నాటకరంగంమీద శీలాన్ని వొదులుకోరని, సంసారస్త్రీలని వేషాలు ధరించమని అబద్ధపు ప్రబోధాలు చేసినట్టే, శీలంఅంటే అర్థంతెలీని నటులు, పోవడానికి అసలు శీలంలేని స్త్రీలూ సినీమాకళ అతిపవిత్రమని దొంగరాతలు రాస్తున్నారు. శీలంతో ప్రశక్తి ఏమిటి? అన్నా, శీలం ఏమి మహాగొప్ప- అన్నా, శీలం పోగొట్టుకోడం చాలా ఉదారమైన కార్యమని రాసినా నాకు అర్థమవుతుంది. కాని శీలం చాలా ఘనమైన పదార్థం, అది సినిమాలలో సురక్షితంగా వుంటుంది, అని ప్రజల్ని మోసపుచ్చడం చూస్తే, ఆ కార్యం ఘాతుకమంటాను. అడవిలో పాములూ, పులులూ ఉన్నాయి - జాగ్రత్త అనడం న్యాయం. జాగ్రత్తపడి-పో, ప్రాణాలమీద అంత తీపి లేకపోయినా వెళ్ళు అనడం న్యాయం. కాని, నీ హృదయంలో దౌర్జన్యం లేకపోతే, పులిని బ్రహ్మస్వరూపంగా చూసుకుంటో వెళ్ళు. నీకేం భయంలేదు అని ప్రతివారినీ ఉద్బోధించడం మూర్ఖం. 'పులులులేవు ఏమీలేవు. చాలా హాయిగా వుంటుంది అడవుల్లో' అనడం మోసం.

నిజస్థిత తెలుసుకుని, ప్రతి సంగతిని వాస్తవమైన పేరుతో పిలిస్తే సగం చికిత్స జరిగినట్టన్నమాటే. ప్రపంచంలో సగం మోసం అబద్ధపు పేర్లవల్ల జరుగుతోంది గనక, సినీమాలో చేరనన్నాళ్ళూ చేరాలని ఆశపడడమేగాని చేరిన వాళ్ళందరూ, సినిమాలో ధనం సంపాయించుకున్న దరిద్రులు తప్ప-వాళ్ళుకూడా-సినీమా వాతావరణాన్ని తిట్టేవాళ్ళే. కాని ఒకసారి ప్రవేశించిన తరవాత వదలలేదు. సినీమా వాతావరణం వాస్తవమూ, ప్రపంచం మాయగా తోస్తుంది. నీడలకి నిజమైన వస్తువుల గుణం

వొస్తుంది వాళ్ళ కళ్ళకి, తాగుబోతు మనిషికి మల్లే, ధనమూ కీర్తీ. రెండే ముఖ్య సూత్రాలు 'గెట్టింగ్ ఆన్ క్లైంబింగ్ ఆన్' అదే జీవిత పరమావధి. ఆ దేవత ముందు బలికి పనికిరాని ఆదర్శంలేదు. చాలా వృత్తులలో వుంది యీ గుణం. కాని సినిమాలో అమితంగా వ్యాపించింది. దేవతలలో, పతివ్రతలతో, మునులతో, హీరోస్‌తో చాలా సమీప పరిచయం వల్ల వాళ్ళ నిజతత్వం తెలుసుకుని అందరూ 'సినిక్స్' ఐనారు. ధనం పోగుచేసే శక్తి ఉన్నంతమాత్రాన, పెట్టుబడిదార్లని మాటలతో మోసగించే ప్రజ్ఞ వుండే మనిషి డైరెక్టరై, సంగీతం అంటే ఏమిటో, కళ అంటే ఏమిటో, తెలీక నాట్యమూ, యాక్టింగ్ వీటినన్నిటినీ నిరంకుశ ప్రభువు ఐ శాసిస్తున్నాడు. 'ఛా! ఇదేంకథ! ఇక్కడ, ఇక్కడ? మార్పు' అని కథకుణ్ణి శాసిస్తున్నాడు. కథ అంటే ముక్కూ మొహం ఎరగని ధనవంతుడు అందం కల స్త్రీ, తెలివిగలది, శీలవతి, పాటకురాలు, ఆదర్శవ్యక్తి అంటుంది.

గొప్పగా ఎవరికీ కనపడక ఇన్‌టర్‌వ్యూలకన్నా దొరకని యీ డైరెక్టర్లు, ఏ గొప్పతనమూలేని ఎడ్వెంచర్స్ అనీ: వాళ్ళ స్వభావాల్లోని నీచత్వమే కొడ్డిస్నెస్ ఏ వాళ్ళని పైకెత్తిందనీ: ప్లీడర్లకన్న అధములై పోయినారని స్వభావంలో: వాళ్ళని యాచించడం కన్న అధమదశ యింకోటిలేదనీ: యీ నటీనటులు పడేయాతన విరోధులకి కూడా కోరతగనిదనీ: ధనంకోసం ప్రకటన కోసం వాళ్ళు చెల్లించిన విషయాలు అన్ని విలువలనూ మించినవనీ: వీళ్ళందరూ సైతానుకి ఆత్మల నమ్ముకుని ధన తను సంపాయిస్తున్నారనీ: విరివిగా యువకులలో ప్రచారం చెయ్యాలి.

ఆ మనుషులలోలేని గొప్పతనం, యీ ఆశ్రయింపులవల్లా, గ్లామర్ వల్లా, పిచ్చి ప్రజలు వాళ్ళకి ఆరోపించి, గౌరవమూ, భక్తీచూపడం వల్ల, తమ బొమ్మలకి కాక తమకే గొప్పతనం వుందని వాళ్ళే నమ్మడం ప్రారంభిస్తారు. రామాయణం ఫిల్ముతీసి వాల్మీకికి కీర్తి తెచ్చాననుకునే స్థితికి వొస్తారు. అనేకవాటికి చాలా నిదానంగా విలువలు కట్టే తెలుగువాళ్ళకూడా



మనుష్యుల్ని వెర్రిగా పూజించని యీ దేశం మనుషులుకూడా, సినిమా ఘాటికి తాళలేక తబ్బిబ్బులై, సినిమా స్టార్లపేర్లు (తెలుగు వారిని కాకపోతే హిందీ వారివి) అతి భక్తితో తన్మయంలోపడి వుచ్చరించుకుంటున్నారు. పటాల్నీ మనుష్యుల్నీ విడతీసి చూసుకోగలిగిన విచక్షణలేదు ఇంకా. అందంగా వున్న మనిషి పాడింది గనక సంగీతంకూడా శ్రావ్యంగా వుందని ఆత్మ వంచన చేసుకోడంనించి ఇంకా తెప్పరిల్ల లేదు ప్రజ. ఈ స్టార్స్ చాలా దూరాన వుండడం అంత మంచి విషయంకాదు. వాళ్ళే రోజూ కనపడి పరిచయమైతే, చిత్రాలు కూడా చూడడం త్వరలో మానేస్తారు ప్రజలు.

స్టూడియో, డైరెక్టర్లూ, నటీనటులూ ఉన్నతులైతే తప్ప ఫిల్ములు ప్రజలకు ఉపకరించవు, కళాప్రియుడు గొప్ప డ్రీమర్. ప్రజలమీద ప్రేమ కలవాడు, ఉన్నతమైన ఆత్మకలవాడు (అట్లాంటివాళ్లు దేశానికి నలుగురుంటారా?) ప్రొడ్యూసరు, డైరెక్టరూ ఐ చిత్రాలు తీస్తే మారుతాయేమో పరిస్థితులు! కాని అట్లాంటివాళ్ళకి ధనం వుండదు—వాళ్ళని ధనవంతులూ, పేదవారూ కూడా నమ్మరు—వాళ్ళు తీసే చిత్రాలు ప్రజలకి నచ్చవు.



# బాధ

ఎంత తరచి చూసినా లోకంలో బాధ వుండడం అన్యాయం: ఘోరం. మతాలు యీ బాధని, శిక్ష అనీ, కర్మ అనీ, ఈశ్వరేచ్ఛ అనీ, ఎంత సమర్థించచూసినా అర్థంలేని మాటలనిపిస్తాయి. ఇంక ఆత్మా, ఈశ్వరుడూ, లేడనే వాళ్ళకి ఈ బాధ వుండడమే వాళ్ళ వాదానికి పెద్దబలం. వాళ్ళూ ఏదో విధంగా సమర్థిస్తారు. ఈ బాధ తాత్కాలికమనీ. మనుష్యుల మూర్ఖత్వం స్వార్థంవల్ల ఏర్పడిందనీ, యీ సంఘాన్నీ ప్రపంచాన్నీ వేరే విధంగా సంస్కరిస్తే పూర్తిగానో, చాలావరకో తీసివెయ్య వొచ్చుననీ వాళ్ళ విశ్వాసం. కాని ఈనాడు నేను ఈ బాధ ఎందుకుపడాలి? అనే ప్రశ్న అర్థంలేనిదై పోయింది. బాధ యింత సామాన్యమూ, మామూలూ కావడం వల్ల. కాని ఆ ప్రశ్నకు ఏమీ జవాబులేదు, కన్నీటి తుడుపులు తప్ప.

బాధ అనేదీ వుంది. దాన్ని అంగీకరించి, ఈ సృష్టి ప్లాన్‌లో బాధ స్థానం ఏమిటి? వుత్త బాధించడమేనా, అంతకన్నా బాధ ఏమన్నా ఉపయోగపడుతోందా? అంటే బాధవల్ల చాలా గొప్ప ఉపయోగాలు కనబడతాయి. సృష్టి ఈ పద్ధతుల మీదనే జరిగివుంటే, బాధ వుండితీరాలి. కాని బాధవల్ల ఉపయోగం జరగకుండా, బాధవుంటేనేగాని అభివృద్ధి వుండదనేది లేకుండా, ఎందుకు సృష్టి ఏర్పడి వుండకూడదని ప్రశ్న! కాని ఈ ప్రశ్న ఎవరిని వెయ్యాలి? ఈ ప్రశ్నను తీసుకునేదెవరు? జవాబు చెప్పేదెవరు? బాధకి లోపడే ఏజీవికీ అధికారంలేదు జవాబివ్వటానికి. జవాబిచ్చినా మనని నమ్మించలేరు. ఇంతవరకు లోకంలోంచి వొచ్చిన జవాబులేవీ సృష్టినిచ్చే



గావు, అంధవిశ్వాసంలో తప్ప. ఈ సృష్టికి కారణమైన ఓ జ్ఞానయుతమైన శక్తివుంటే దానికొక్కదానికే వుంటుంది జవాబు చెప్పగల సామర్థ్యం. అది వున్నా అట్లాంటి జ్ఞానశక్తి ఒకటివుంటే, అదీ పలకదు. పలికితే, ఆ వాక్కును వినేశక్తి మనకిలేదు. ఎవరికీ లేదు.

టాగూరుగారి వేదాంతం ప్రకారం, సంపూర్ణమైనది ఒక్కటే వస్తువు. అది భిన్న మెప్పుడయిందో అది అసంపూర్ణం. అసంపూర్ణం కనుక దానికి నిశ్చితానందం లేదు. అందువల్ల బాధ తప్పదు. సంపూర్ణ శాంతి స్థితిని పొందడానికి పడే శ్రమే యీ బాధ. చిన్నప్పుడు ఈ వేదాంతాన్ని మిత్రుడు అత్మారాంతో చెపితే, ఒకటి అనేకం అవడం మాథమాటికల్ అబ్సర్డిటీ అన్నాడు అతడు. కాని ఈనాడు అబ్సర్డ్ కాదు. కొత్త మాథమాటికల్ ఫిలాసఫీలో, ఒకటి. అనేకమూ అనేవి వుత్త దృష్టి భేదం. మనసు కల్పించే మాయ. కాని అప్పటికీ ప్రశ్న వదలదు. ఆ వొకటి: బుద్ధివున్న వొకటికదా, అది అనేకం కావడమెందుకు? ఈ బాధలకి కారణం కవ్వడమెందుకు? ఇట్లా జీవరాసుల్ని కాల్చి చంపడమెందుకు? నాలికమీద తేనెని రుచి చూపించి, ఆ రుచి వెనకనే నాలికని తేలుకుమల్లే కుట్టడమెందుకు?

భగవాన్ మొదలయిన యోగులు లోకమే మాయ అనడంవల్ల, బాధనే మాయంచేశారు. కాని సత్యంకానీ, మాయకానీ: బాధపడే ఈ నిమిషంలోని నా అనుభవం మాయ అనడం నేనేమాత్రం వొప్పుకోలేను. ఈ బాధ తెలీని స్థితి వుండవొచ్చు. ఇంతా మాయ అని తెలుసుకోగలిగిన ప్లేన్ వుండవొచ్చు-వుంటే వుండనీ, ఏనాడో నేను దాన్ని అందుకోనీ. కాని ఈనాటి నా బాధ అసత్యంకాదు. నా చిన్నతనం ఈనాడు చాలా దూరమై ఆనాటి ఏడుపులూ, తగాదాలూ వుత్త వెర్రి అనుకోవచ్చు. నా కసలు చిన్న

తనం లేనే లేదనుకోనూవొచ్చు. కాని, నేను ఆనాడు పడ్డ బాధ నిజం కాకుండాపోదు. గొప్ప ధనవంతుణ్ణి ఐన రోజున కూడా ఈనాటి నా బీదతనపు రోజులు అసత్యం కావు.

బాధ—శరీరకం, మానసికం అనే భేదమేకాక, వ్యక్తం అవ్యక్తం అనే ముఖ్యభేదం వుంది. ప్రపంచంలో ఎక్కడ చూసినా వృక్షాల దగ్గిర్నించి, మహా పురుషులదాకా అంతటా నిరంతరం అవ్యక్తమైన వ్యథ స్థిరంగా పనిచేస్తున్నట్టు కనపడుతుంది. దీన్నే నేను స్ట్రగుల్ అంటాను. ఏదో అందుకోవాలనే యత్నం; తమ స్థితితో అసంతృప్తి. దీనివల్లనే పరిణామం జరుగుతోంది. ప్రత్యేకంగా జీవిలోనూ, అసలు విశాలమైన ప్రపంచ జీవితంలో కూడా. ఇంక వ్యక్తమైన శరీరబాధని డాక్టర్లు, రోగానికి చిన్హం అంటారు. బాధ లేకపోతే రోగం కలిగిందని తెలీదు. కాని పెద్ద ప్రశ్న ఏమిటంటే, అసలు రోగం ఎందుకు వుండాలి! ఆ రోగం వుందని తెలిపేందుకు ఆ బాధని ఉపకారిగా చూసుకోడం యెందుకని! అట్లానే మనసులో బాధ, మనస్సులోని రోగాన్ని తెలియచేస్తుందనుకోవచ్చు. రోగమంటే మనసులో అస్థిమితం.

ఎంత కసి కనపడుతుంది సృష్టికర్త హృదయంలో! చాలా స్పష్టంగా ఇదంతా కర్మఫలం అని తెలుస్తో వుండగా, ఎందుకింత గోల చేసి రాస్తాడు, వెతుకుతాడు అనుకుంటారు మనుషులు. అసలు ఎందుకు దుష్కర్మ చెయ్యాలి? తాము ఏమీ అణుచుకోలేని, మార్చుకోలేని స్వభావం వల్ల, మెతపొంచి ఇరికించి ఆ పని చేయించి పరిస్థితులవల్ల మనుషులు పని చేస్తారని ఈనాటికీ తెలుసుకోలేకపోతే చాలా అంధులు మనుషులు. మానవుడు తన పనులకి పూర్తిగా కర్త అనుకోవడం పాత మతాల మూఢత్వం. అసలు దుర్మార్గం చేసేట్టు ఎందుకు పుట్టాలి? ఎవరన్నా సృష్టికర్త వుంటే, యీ కర్మ అనేదాన్ని పెట్టడం చాలా క్రూరత్వం. యెటువంటి కర్మని



న్యాయమని సమర్థించుకున్నా, తిండిలేక గజ్జిపట్టి, దిక్కులేక తిరిగే కుక్కపిల్లలు, పిల్లి పిల్లలు, బోన్లలోని మృగాలు, పిల్లల్ని తినేస్తే ఏడ్చే పక్షి తల్లుల గోల, గోడలో మొలిచి నీళ్ళులేక ఎండే మొక్కలు క్షుధ—ఇట్లాంటి బాధని ఏ కర్మ సిద్ధాంతమూ సమర్థించలేదు.

కర్మలో నమ్మనివాళ్ళు, ఇదంతా మూఢత్వంలో మనుషులు చేస్తున్నారనీ, అభివృద్ధి చెందినకొద్దీ బాధలు తగ్గిపోతాయనీ, ఏ కమ్యూనిజమో రక్షిస్తుందని కలలుకంటారు ఇంకేం చాతగాక. కాని ఒక్క మానవుడిలోనే కాదు సమస్త జీవులకీవుంది నిరంతరమైన వేదన. మనుష్యుడైనా ఒకరకమైన కష్టంలోంచి ఇంకోరకం కష్టాలలోకి నడవడమే కనపడుతోంది ఇన్ని యుగాలూ. ముందెప్పుడో భూతలస్వర్గం రాబోతూందనడం తనని తాను మోసపుచ్చుకోడంలాగే తోస్తుంది.

కొన్ని జీవితాలు నిరంతరం బాధ. ఎంత బాధకి ప్రయోజనం చెప్పుకున్నా ఎక్కడా ప్రయోజనం కనపడని బాధ అమితం. లోకస్వరూపం బాధ అనడం తప్ప గతిలేకుండా పోతుంది. పుట్టడమే బాధలతో పుట్టి, ఏడ్చి, ఏడ్చి చచ్చే పసిపిల్ల, గానుగ ఎద్దు, ముసలితనంలో కొరడా దెబ్బలు తినే గుర్రం, బోనుల్లో మృగాలు, పంజరాల్లో పక్షులు, జీవితమంతా ప్రతి అడుగుకీ దరిద్రం, చావులు, అనారోగ్యం, పూర్వం వోడల్లో గొలుసులతో కట్టేసిన బానిసలు న్యాయధిక్కారమనే పేర చీకటిగదుల్లో కాంతి నెరగని హింసలుపడ్డ దేశభక్తులు, ఎటు ఎంత సమర్థించీ జవాబురాదు, ఉపయోగం కనపడదు—ఆ మనుషులకి గాని, ఇతరులకి గాని.

కాని మనుష్యాభివృద్ధిని గమనిస్తే బాధలోంచి గాని ఆత్మాభివృద్ధి లేదు. ప్రపంచానికి వెలుగునిచ్చిన ప్రతిమనిషీ నిప్పులోంచే నడిచాడు. కాని నిప్పుల్లోంచి నడిచిన ప్రతి మనిషినించీ వెలుగు రాలేదు మరి!

'నా జీవితంలో గొప్పభాగం వ్యధకి ఇచ్చివెయ్యాలని ఏర్పడ్డది.' అంటారు టాగూరుగారు, డి.కె. రాయ్‌తో. ఆయన కవిత్వానికీ బాధకీ,మరి సంబంధం వుందేమో! అంత వ్యథలోంచి- మనకి గొప్ప ఓదార్పునిచ్చే కవిత్వం వొచ్చింది.

'ఎందుకండీ అరుణాచలం వెళ్ళారు మీరు?' అన్నారు పింగళి నాగేంద్రరావుగారు నాతో.

'శాంతికి'

'శాంతికా! ఎందుకు శాంతి?'

'వ్యథ భరించలేక, నాలో నా మనసులో పుట్టే ఈ ఆరాటపు బాధ భరించడం అశక్యమై.'

'బాధ పోయి శాంతి వస్తే ఇంక మీరేం రాస్తారు?'

ఇప్పటి మీ మ్యూజింగ్స్‌లో మీ రాతకి వెర్రి దూకుడు తగ్గి ఓ స్తిమితం ఓ మార్గం ఏర్పడ్డది. రాతేమాని ఇంతలో చావు శాంతిలోకి పోతారా?'

'రాయకపోతే నేం ?'

'దానికి జవాబు మీరే అంటున్నారన్న మాట. చెత్తరాతలు గాక, వాస్తవం పలికేవన్నీ బాధలోంచే బైలుదేరేయి మరి!'

'కావొచ్చు, మీరందరూ హాయిగా చదువుకునేందుకు- రాత్రింబవళ్ళు నేను భరించలేని వేదనతో గడపమంటారా?' అన్నాను జాలిగా.

సహృదయంగా నవ్వారు ఆయన. ఇంకోప్పుడు ఆయన రైల్లో అన్న ఇంకోమాట తలుచుకుని ఇంకా నవ్వుకుంటో వుంటాను. ఆయనతో బందరు యువకుమారులు—

'చలం తన కథానాయికల్ని ఇంగ్లీషులోంచి దొంగిలించాడు' అన్నారట.



'చాలా దూరం వెళ్ళారే! మీ కళ్ళముందునించే మీ కథానాయికల్ని సావిత్రిని, తారని, చిత్రాంగిని దొంగిలించాడు. అది గమనించారా?'

అంతకన్న గొప్ప విమర్శ లేదు నా పుస్తకాలమీద.

ఇదివరకు వాళ్ళంతా పూర్వం బాధలేని కృతయుగం ఉండంటే బాదస్తమని నవ్వారు. ఇప్పటివాళ్ళంతా చాలా దగ్గిరిగా వ్యవధిలేని కృతయుగం వొస్తోందంటే చాలా సులభంగా నమ్ముతున్నాం.

రెండింట్లో ఏది నిజమని రూఢిలేదు.

ఈ మధ్య నా ఆపదలు విన్న చిన్నారావుగారు రాస్తున్నారు. 'ఇంక ముందు మీ రాతలు ఇంకా లోతుగా వుంటాయి గావునని' అని రాసి నాగేంద్రరావుగారితో చేతులు కలిపాడు. అవును, నిజమే, మనిషికి ఆపదలే రానీ, సంతోషాలేరానీ, వొచ్చినవి ఎట్లాగూ వొచ్చాయి. తాను వాటిని ఎట్లా సొమ్ముచేసుకోవడమనే దృష్టి మనిషికి వొదలదు, తానే మాయ మయిందాకా.

ఏమి లోతులో, ఏమి రాతలో! ఏద్దైనా అందంగా ఆకర్షంగా చెప్పడంలో వుంది. ఉమామహేశ్వర పండితులు ఉపన్యాసమిచ్చేవారు హిందూమత ఔన్నత్యంమీద.

'హిందూమతం ఉక్కుస్తంభం. మహమ్మదీయులు కత్తి తీసుకొచ్చారు స్తంభాన్ని నరకాలని. ఆ స్తంభానికి ఆ కత్తి తగిలి, వాళ్ళ తలల్ని గొరిగేసింది. అట్లా కాదని క్రిష్టియన్లు చెరోచేత్తో చెరోకత్తి తీసుకొచ్చారు. ఆ కత్తులు ఆ ఉక్కుకి ఎదురు తిరిగి కత్తెరపడి వాళ్ళ తలల్ని క్రాఫ్ చేశాయి.' అని.

ఇట్లాంటివెన్నో ఆ చమత్కారాన్ని ఆర్గ్యుమెంటుకింద తీసుకుని, తబ్బిబ్బులై, చాలా బుద్ధిమంతులు, కేసులో చిన్న పొరపాట్లని చీల్చి పెట్టగల లాయర్లు, ఆయన మాటల్లో అసత్యానికి దాసోహం చేశారు. కాశి క్రిష్ణమాచారిగారి ఉపన్యాసంలో వాదం అమోఘమంటే, జాగ్రత్తగా విన్నాను. ప్రపంచానికి హిందూదేశం పునాదీ అనీ, హిందూధర్మం ఉత్తమోత్తమమనీ

సహేతుకంగా, పశ్చిమ సయంటిస్టులనించి కోట్ చేస్తో నిరూపించారు. వాక్ప్రవాహాన్ని విడదీసుకుని అతి జాగ్రత్తగా వింటేనే తప్ప ఆ ఆర్గ్యుమెంటులో, అతుకులూ దాట్లూ కనపడవు. ఆయన మా బడి కాలంలో ఆ లెక్చర్లివ్వడం వల్ల తప్పించుకోలేక పోయినాను.

రాతకూడా అంతే. ఎవరు చమత్కారంగా ఆకర్షకంగా రాయగలిగితే వాళ్ళకిస్తుంది చెవి లోకం. లోతులూ అక్కర్లేదు; ఎత్తులూ అక్కర్లేదు, ఎంత గొప్ప సత్యాలైనా ఆకర్షకమైన మాటల్లో చెప్పలేకపోతే ఎవరూ వినరు పాట పాడాడూ చాలా మంచి కంఠంతో, ఏనుగులు ఎగిరాయన్నా, చాపలు నవ్వాయన్నా కూడా నిజమే నంటారు. 'నా పతి రూపము ఇవ్వరయ్యో!' అని ఏడుస్తుంది ఎవరో మా పక్కసినిమాలో. ఆ మాటల్ని బుద్ధిమంతులు గుమిగూడి శ్రద్ధగా వింటూ నుంచుంటారు, కంఠం చాలా శ్రావ్యం గనక.

ఇంత బాధలోనూ, సృష్టి చేస్తున్న ఘోరమేమంటే బాధని అపరిమితం చెయ్యదు, ఎక్కడోగాని. బాధని ఓర్చుకోగల వోర్పుని అనంతంగా ఇస్తుంది. అంత వ్యథలోనూ ఏదో చిన్న సుఖాన్ని కల్పించి భ్రమ పెడుతుంది.

'కన్నీటి కెరటాల వెన్నెల' అందుకే శాస్త్రిగారూ ఇంత మోసం చేసే మనిషే ఉంటే వాణ్ని తప్పకుండా నాశనం చేసితీరతాం. శత్రువుల్ని లోపరచుకుని రహస్యాలు లాగే టార్చర్స్‌ని మనుషులు దేవుడినించే నేర్చుకున్నారు. దురదృష్టం ప్రారంభించిందంటే: 'పోనీ-కానీ, ఏం చేస్తాం!' అని ఏదో మళ్ళీ జీవితం కట్టుకుంటోవుంటే, వెంటనే ఇంకో దెబ్బ తగులుతుంది. 'ఇంక లాభంలేదు అణిగిపోయినాం'. అంటే కొత్త ఆశ కనపడుతుంది. దీనినంతా ఈశ్వరుడి కరుణ అని స్తుతించుకుంటోవుంటారు, భక్తులు. వాటిని పోతన్నా, త్యాగయ్యా, వేమన్నా అని ఫిల్ములుగా మార్చి మూఢత్వ ప్రచారంతో డబ్బు చేసుకుంటారు ఘనులు— దరిద్రాన్నీ, ఆపదల్నీ, వాంఛనీయమైన వరాలుగా బోధించి, గాలం నోట్లో గుచ్చుకొన్న చాపకన్న హీనంగా తన్నుకుంటాడు మానవుడు. జీవితమంతా కూడా, ఆ గాలాన్ని వొదిలించుకోగలననే మాయ ఆశతో, వొదిలించుకున్నామన్న



మానవుల అబద్ధపు కబుర్లు నమ్మి. గాలం గుచ్చుకుంటే త్వరగా స్వర్గానికి వెడతామనేవాళ్ళు. నీళ్ళు అనే వూపిరాడని లోకంనించి పైకి మోక్షానికి ఎత్తే వరం ఆ గాలం అని పాడేవాళ్ళు. ఓసారి గాలపుబాధ పడితేనే గాని, నీటి విలువ తెలీదని బోధించే వేదాంతులు, నోట్లో గాలం గుచ్చుకున్నా, గుచ్చుకోకపోయినా ఒకేరీతిగా నవ్వుతో వుండాలనే బోధకులూ—నిండి కులకులలాడుతోంది ప్రపంచం వీళ్ళతో.

అందువల్లనే దేవుడిలోకన్న సైతానులో ఎక్కువ నిజాయితీ. దేవుడి కరుణనీ, ప్రహారత్వాన్ని కూడా నిర్లక్ష్యంగా యెదురు తన్నగలిగిన వాడు అతనొక్కడే.

అందువల్ల నే దేవుడికన్న సైతాను చాలా నిజమైన మనిషి.

'ఇంత బాధ పెట్టింతరవాత, నీ సుఖాలు నాకేం వొద్దు' అని తన్నగల శక్తి రావాలి మానవుడికి.

ఏదన్నా ఓ దేవుడే వుంటే నిరంతరం వాణ్ని మొహం వాచేట్టు తిట్టక ఇంకా స్తుతులు ఈ దొంగ గడ్డాల భక్తులా.

“ 'లిల్లీ' కష్టపడదు చూడండి” అని జీసస్. లిల్లీ కష్టపడకేం, తిండికోసం వేళ్ళని బురదలోకి పోనిచ్చే వెతుక్కుంటోంది అడుగున. అడుగున చేరి లక్ష పురుగులు కొరుక్కుతింటున్నాయి కాడనీ, దుంపనీ. లిల్లీ నవ్వూ, కాంతం వుత్త మోసం.

'నీ భారాలు ఈశ్వరుడిమీద పెట్టు' అంటారు.

పెట్టారు చాలామంది. పెడితే ఆ భారాన్ని ఎక్కడ మాయం చేశాడో చేసేశాడు ఆ మోసగాడు. ఆ భారాలు తప్పిపోయినందుకు సంతోషించాలిట. రైల్లో నీ మూట పోయినప్పుడు, సంతోషించు తెలుస్తుంది.

చాతైనంతవరకు తగూపెట్టి, నా భారాన్ని నేనే కాపాడుకుంటాను. దేవుడి చేతికివ్వను. దేవుడు నాకన్న బలవంతుడే కావొచ్చు. కానీ, నన్ను తన్ననీ, కాని తగూ లేకుండా, నా భారాన్ని దేవుడికిచ్చి మోసపోను. ఇచ్చిన వాళ్ళకి పరలోకంలో ఆ భారాన్ని మళ్ళీ వొప్పగించాదేమో గాని

ఆ దేవుడు, ఈ లోకంలో మళ్ళీ సొంతవాళ్ళ కంటపడలేదు, దేవుడి కిచ్చినది ఏదీకూడా.

జీవితం భూమిమీద నిలిచేటంత సుఖాన్ని, విలునీ కలగచేసి, బతికించి ఎంతవరకు భరించగలదో అంత బాధ పెట్టే శక్తిని పైగా మెచ్చుకోవడమా? ఎండాకాలంలో సులభంగా వేడి 160 డిగ్రీలై, అన్నీ చచ్చిపోవొచ్చు. కాని కాదు, 127 డిగ్రీలై పెనంలో కాలుస్తుంది. తిన్న శనగపప్పు విషం కావొచ్చు సులభంగా. కాదు కడుపునొప్పితో గిలగిలలాడిస్తుంది, దాన్ని నయం చెయ్యడానికి ఓ మందు. ఆ మందు ఖర్చు. పైగా దానినించి ఇంకోబాధ! 'బాగా తిను. ఇదీ తిను. ఇంకా తిను' అని రుచి, ఇదంతా ఓ విజ్ఞానమో, ఓ దయగల హృదయమో, చేస్తోందంటారా? ఉండవొచ్చు మన యీ చిత్తుని కల్పించే ఓ విశ్వచిత్తు. కాని దానికి దయాదాక్షిణ్యాలున్నాయన్నమాట అబద్ధం.

కందిపప్పులో కమ్మదనం పెట్టావు
దూది పరుపులో దూరనిచ్చావు
ఆడదానిలో అందా లమర్చావు
కోపెల కూకూలో కోమలత్వమిచ్చావు,
ఎంత గొప్ప దయ అంటారు.

అట్లా అన్నందుకే టాగూరిగారి గీతాంజలి మీద కోపం శ్రీశ్రీకి. ఎంత న్యాయం ఆ కోపం ! ముందు ఆకలీ, కామమూ, అలసటా, శరీరంలో ఇంత బాధకి వీలుగా పెట్టిన రాక్షసత్వం చూడరేం? ముందు దాన్ని కల్పించి, ఆ అవసరాన్ని కొంచెంగా తీర్చి, ఎంత ఉపకారం చేశామో అనే ప్రభుత్వాలే నయంకాదూ, యీ విశ్వప్రభుత్వం కన్న!

ఎండలో మాడ్చి కొంచెం కన్నీళ్ళిచ్చి
చలిలో గడ్డ కట్టించి చలిమంటవేసే దేవుడికి కృతజ్ఞతా !

ఆమాత్రం చెయ్యకపోతే, అన్నీ చచ్చిపోతాయి. అప్పుడు బాధించ దానికి యెవరుంటారు ఆ రాక్షసికి ! అదీ ఆ మహాప్రభు దయ! ఇట్లాంటి తలిదండ్రుల్ని, అత్తమామల్ని ఎందర్ని చూట్టంలేదు మనం ! కావలిస్తే నూజివీడు ఓసారి వెళ్ళండి.



గొప్ప బాధ తటస్థించి, దాన్ని జయించగల పటుత్వం వుంటే వారికే బాధని అనుభవించడమే కాదు. ఆ బాధని తనదిగా చేసుకొని, దానినించి ఓ విజ్ఞానాన్ని పొందగలగడంవల్ల మనిషికి పరిపక్వతవొస్తుంది, ఆ స్థితి ఇతర్లని అర్థంచేసుకోగల శక్తిలో, విలువా, మాధుర్యం, స్తిమితం ఇట్లాంటి వాటిల్లో కనపడతాయి. గొప్ప కళాసృష్టికీ, ఆధ్యాత్మికయత్నానికీ, సోపానమవుతుంది, బాధాశక్తి. కాని మనిషి భరించలేని బాధ తటస్థించి, ఆ బాధకి లోబడిపోయినప్పుడు, తన సంగతే యోచించుకునేవాడూ, ఏడుపుకొట్టూ, అన్నిటిలోనూ విషాదమే చూడగల మనిషిగా ఐపోతాడు.

కాని చాలామంది మనుషులు బాధవల్ల ఇటూగారు అటూగారు, మామూలుగా తీసుకుని ఎప్పటిమల్లేనేవుంటారు. అసలు కవిలో పలికినట్టు బాధ వాళ్ళల్లో పలకదు.

భార్యలు చాలామంది చచ్చిపోతున్నారు. కాని టాగూరు భార్యమృతి ప్రత్యేకమయింది. ఆయన మృత్యువంటే అర్థమేమిటనే ఆధ్యాత్మికాన్వేషణవల్ల ఈ నిత్యజీవితంలో మృత్యువుకి సంబంధంకలపాలనే ధీరత్వంవల్ల ఆయన మృత్యుగీతాలు చదువుతూవుంటే-ఏనాడో రాబోయే తన చావుకూడా-చావు జీవితానికి విరోధీ, నెగిపన్ కాక, జీవిత సాఫల్య మనిపిస్తుంది. ఘోరమైన మృత్యువు లోకాన్ని ఒక కసాయిశాల చేస్తూవుంటే దయగల ఈశ్వరుణ్ణి ఏవిధంగా అంగీకరించగలమనే నాబోటివాళ్ళ ప్రశ్నకి టాగూరులో కవిత్వపరమైన శ్రావ్యమైన ప్రత్యుత్తరం దొరుకుతుంది. ఆ కవిత్వ మాధుర్యంతో మోసపోయి జవాబు దొరికిందనుకుంటున్నావు జాగ్రత్త అంటారు గావును శ్రీశ్రీ.

జీవితం ఘోరం, మృత్యువు ఘోరం - అంటారు సినిక్సు. జీవితం మధురం, మృత్యువు ఘోరం-అంటారు గావును శ్రీశ్రీ.

జీవితం నిజం, మృత్యువు నిజం అంటాడు సయన్టిస్టు.

జీవితం నిజం, మృత్యువు మాయ—అంటారు టాగూర్.

జీవితం మాయ, మృత్యువు మాయ—అంటారు భగవాన్.

మన అభిరుచి ప్రకారం దేన్నైనా తీసుకోవొచ్చు, అన్నీ అబద్ధాలూ, అన్నీ నిజమేగనక మొత్తానికి ఏది నిజమో, యేది అబద్ధమో ఎన్నటికీ తెలుసుకోలేముగనక.

'అట్లా కవిత్వాల్లోకీ, వేదాంతాల్లోకీ, పెళ్ళక, స్పష్టంగా ఆలోచించు అట్లా పరస్పర విరుద్ధమైన ద్వంద్వాల్లోకి పోక' అంటారు. కాని చూస్తున్న కార్డ్ ఏవీ స్పష్టంకాదు. స్పష్టంగా కనపడుతోందంటే' దృష్టి చాలా హ్రస్వం. చీమ కంటికి బియ్యపుసూక చాలా స్పష్టంగా. తక్కిందంతా అసలు లేదో, వుంటే చాలా అక్కర్లేనిదీ, అర్థంకానిదీ

మృత్యువు ఏమిటని ప్రశ్న ఇనెవిటబుల్‌గా ఆ నిమిషాన తాను సాల్వుచేసుకు తీరవలసిన సమస్య అయేటప్పటికి, భగవాన్‌కి జ్ఞానోదయమయిందట.

అట్లానే వుత్త ఇంటలెక్చువల్ ప్రాబ్లెంగా కాక, ఏదో దూరంగా క్యూరియాసిటీగా కాక, ఆ నిమిషాన దాన్ని తెలుసుకోవలసి రావడం లైఫ్ అండ్ డెత్ వ్యవహారం కింద వొచ్చినప్పుడు, ప్రత్యుత్తరం తెలుసుకో గలిగిన శక్తి మానవుడిలోనే వుందంటారు. అది నిజమనడానికి అనేక ఉదాహరణ లున్నాయి. చాలా గొప్ప డిస్కవరీలు ఆ విధంగానే జరిగి వుంటాయి. కాని మృత్యువువంటి దూరమైన సమస్యని అంత గట్టిగా దగ్గిరిగా తీసుకో గలగడం ఎట్లాననేదే ప్రశ్న. అప్పుడు మనిషినించి ఇన్ని కట్టల మ్యూజింగ్స్ రావు. ఒక్క పలుకుతో, చూపులో సత్యం ప్రసారమౌతుందిగావును.



# త్యాగం

త్యాగం చెయ్యగానే ఆ త్యాగమహిమవల్ల మనిషికి కొన్ని హక్కులు యేర్పడతాయి. పసితనంలో బిడ్డకోసం పడ్డ శ్రమవల్ల తల్లికి బిడ్డమీద యావజ్జీవం హక్కు ఏర్పడుతుంది. భార్యకి భర్తమీదా అంతే. సాధారణంగా యీ త్యాగాలు చేసే వాళ్ళందరూ బలహీనులు. అందువల్లనే త్యాగంచేసి ఆ త్యాగంవల్ల ఫలితాలమీద హక్కు లేర్పరచుకుంటారు. తాము చేసిన త్యాగాలవల్ల కాంగ్రెసువారికి ప్రభుత్వపు హక్కు యేర్పడ్డది యీనాడు. ప్రభుత్వంపైననే కాదు. ఎలాగో ఒకలాగు సుఖపడడానికి తాము చేశామనుకున్న త్యాగాలకి నూటికి వెయ్యవంతున వడ్డీవేసి అనుభవించడానికి హక్కు యేర్పడింది. ఇది స్వతంత్రంకోసం త్యాగం. ఇంకా స్వతంత్రం కావాలనే పాటలు పాడుకోనే వున్నారు. కాని, ఈనాడు దేని నుంచి స్వతంత్రం కావాలి? పరదేశీయుల ఒత్తిడినించి స్వతంత్రం అంటే అర్థమైనట్టు స్వదేశీయులనుంచి స్వతంత్రం అనేదీ, పరదేశీయుల దోపిడీ నుంచి స్వతంత్రం అంటే అర్థమైనట్టు స్వదేశీయుల దోపిడీనుంచి స్వతంత్రం అనే సంగతి సరిగా అర్థంకాలేదు మనుషులకి. విప్పి నచ్చ చెప్పేందుకు కొత్త గాంధీగారు ఎవరూలేరు. జలియన్ వాలాబాగ్ హత్యల మీద పళ్ళు కొరికి పాటలు కట్టిన మన కవులు నవఖాళీ దురంతాల మీద పళ్ళు కొరకలేదు, ఒక్క పాటా కట్టలేదు, ఎవరిని నిందించాలో తెలీక.

'పోనీలే బ్రిటీషువారూ మన సోదరులేకదా! సర్వమానవ సౌభ్రాతృత్వంలో! పోనీలే వారినే అనుభవించనీండి 'అంటే' సోదరులే. కాని,

తమ్ముల్ని దోచుకోడానికి వీలులేదన్నారు. తమ్ము లెవరంటే హిందూ మహమ్మదీయులన్నారు.

'సరే, బ్రిటీషువారు వెళ్ళిపోతారట. అత్యాశాపరులై మన సోదరులైన మహమ్మదీయుల పరిపాలన హక్కుల్ని కావాలంటున్నారు' అంటే. సోదరులేకాని వారి సంఖ్యకి మించిన హక్కులు వీలులేదన్నారు.

నాకు తెలియక ఓ మిత్రుణ్ణి అడిగాను. 'ఎందుకండీ ఆంధ్రరాష్ట్ర విభజన?' అని.

'భాషాప్రయుక్త రాష్ట్రాలు' అన్నారు.

'ఏం, భాషల ప్రకారం విడదియ్యకపోతే?'

'అదేమిటి? ఆంధ్రవిజ్ఞానము, పౌరుషము' కళలు—' అన్నారు.

'వాటికి ఎవరు ఏం అడ్డం వొచ్చారు?'

'కాదులెండి, మన దేశాభివృద్ధికి.'

'అంటే, డబ్బు అభివృద్ధికేనా? చివరిమాట'

'అవును మరి....'

'మరి మీ సోదరుడేగా తమిళుడు?'

ఊరికే రమణ మహర్షి మాటలు మాట్లాడ వద్దన్నారు నన్ను.

ఆంధ్రరాష్ట్రంలో, రాయలసీమ సోదరులకి చాలా అనుమానం, తూర్పు సోదరులు అన్ని హక్కులు లాగేస్తారని.

నైజాం నాయకులదగ్గర ఒక బల్లదగ్గరే సమావేశ పడ్డాను నేను. విశాలాంధ్ర ప్రస్తావన వొచ్చింది.

'మేము ఇప్పుడే ఆంధ్రరాష్ట్రంలో చేరం' అన్నారు నాయకులు.

'ఎందుకు?'

'మాది చాలా వెనకబడ్డ దేశం.'

'అయితే....'

'మేము మీతో తూగలేం,'



'అంటే మిమ్మల్ని మేము ఎక్స్ప్లాయిట్ చేస్తామనేకాదూ?'

'అవును' అని ఒప్పించాను.

ఇంకోరాత్రి మిత్రులు అంటున్నారు.

'ఇప్పు డెక్కడ వున్నాయండి కులభేదాలు ! మీరు చెప్పేవి యాభయిఏళ్ళక్రిందటి సంగతులు' అని తుడిచేశారు. కొంచెం సేపటికే వారే:

'ఈ కమ్మవారున్నారే....' అని ప్రారంభించాడు.

'కమ్మవారని వేరే యెవరున్నారండీ! కులాలు యాభై యేళ్ళ క్రిందటి మాట' అన్నాను.

'అవునండీ. మరి వారు 'మా కులం. మేము అంటున్నప్పుడు మరి తక్కినవాళ్ళు....'

తక్కినవాళ్ళ మా కులం మేము అనాలి. అంతేనా.

ఈనాడు 'నువ్వు హరిజనుడివి కాదు. నువ్వు మనిషివి. లేక హిందువువి' అంటే ఎంతమంది హరిజనులు సంతోషిస్తారో తెలీదు.

గాంధీగారు గొప్పవారంటే అర్థం ఇంగ్లీషువారిని ఉక్కిరిబిక్కిరి చేసే ఎత్తులు వేయగల రాజనీతిజ్ఞులనీ, కుశాగ్ర మేధావంతులనీ, ప్రజలలో తిరుగుబాటు మెళకువని తెచ్చిన వారనీ, బానిసత్వపు న్యూనతనీ కసినీ చాలావరకు తీర్చినవారనీ; కాని, అహింసని సత్యాన్వేషణనీ భేదభావాన్ని అతిక్రమించినవారని కాదు, ఆయన కోమటనీ, గుజరాతు దేశీయులనీ యెన్నటికీ మరువలేదు మనుషులు.

దినచర్యలో వున్న వాతావరణంలో మెలగాలంటే యీ భేదాలన్నీ గమనించడం అవసరం కావొచ్చు. లేనట్లు చలించడం మూర్ఖం కావొచ్చు. అనేకమందికి తాము చాలా సంస్కారులమనీ, మేధావంతులమనీ, విజ్ఞానపరులమనీ విశ్వాసమున్నవారిని యెరుగుదును. మాట్లాడేటప్పుడు, 'కులా

లేమిటి? దేశాలేమిటి? కళ అంతా ఒకటే. మానవులందరూ సోదరులే, సమానులే. దేవుడు ఎక్కడున్నాడు! ఇంకా యీనాడు మతమేమిటి?

హింస-సహనం — విశాలత్వం అన్నీ మాట్లాడతారు. కాసేపట్లోనే వీటన్నిటికీ విరుద్ధంగా మాట్లాడతారు.

కొంచెంమంది మనుషులున్నా, యీ సంకుచిత తత్వాల్ని, భేదాల్ని మరచి లోపల్నించి తీసేసుకుని యోచించేవారు లేకపోతే థాట్‌లో నన్నా ఆ గట్టితనం, నిర్మలత్వం స్పష్టతా లేకపోతే ఇంకేం సంస్కారం ?

లోకంలో ప్రవేశించి విజయాన్ని సాధించే వారందరూ వారి వారికి అవసరమైన సాధనాల్ని, నియమాల్ని, హద్దుల్ని, భేదాల్ని అంగీకరించుకుని సఫలులైనారు. కాని, ఎన్నటికీ బాగుపడమనుకునే ముద్రపడ్డ నిర్భాగ్యులు వున్నారుగా! ఏంచేసినా, ఏంలాభంలేని, ఏమీచెయ్యలేని అపజయాలు—వారికి వున్నవల్లా కలలూ, యోచనలూ. ఈ ఐశ్వర్యాలనన్నా నిర్మలంగా, ఉన్నతంగా ఉంచుకోకూడదా యనుకుంటారు.

ఈనాడు ప్రపంచంలో, ముఖ్యం మనదేశంలో త్యాగబోధన యెక్కువైంది. త్యాగమంతా ముందుతరాల వారికోసం, కాంగ్రెసులో త్యాగం, కమ్యూనిస్టులలో త్యాగం, ఆహారంకోసం త్యాగం, రాష్ట్ర సంపాదనకోసం త్యాగం, యుద్ధాలకోసం, విద్యావ్యాప్తికోసం, మద్యపానంకోసం అన్నీ త్యాగాలే. ఇన్నియేళ్ళ త్యాగాల ఫలితాన్ని అనుభవించపోయే ఆ ముందు తరాలవారు ఎంత అదృష్టవంతులో! అసలు ఆ తరం ఏతారీఖున వస్తుందో ఈ లోకంలోకి!

యుద్ధానికి ముందు జర్మనీ ఎన్ని త్యాగాలు చేసింది! యుద్ధంలో యెన్నిచేసింది! ఆ త్యాగాల ఫలితం ఈనాడు యెంత గొప్పగా అనుభవిస్తోంది! కనుక, ఈనాడు చేసిన త్యాగాల ఫలితం ఏనాడో ఎవరో తప్పక



అనుభవిస్తారని నిశ్చయంలేదు. కాకపోతే రష్యాపైపు చూపుతారు. అంతా విజయంలో వుంది, అంతేగాని త్యాగాలు విజయం ఇస్తాయని ఎక్కడా నిశ్చయంలేదు.

మనమూ ఒక పాతకాలానికి ముందు తరమూ వారిమే, మరి స్వతంత్రానికి చేసిన త్యాగాల ఫలితం చాలా కొద్దిమందే అనుభవిస్తున్నారు. వెయ్యికి యే ఒక్కరోతప్ప తక్కిన వారికి రేడియో వింటేతప్ప స్వతంత్రం వొచ్చిందని తెలియనే తెలీదు. వెంటనే రేడియోలో స్వతంత్రం వొచ్చింది త్యాగం చెయ్యండి. 'కృషి, కృషి, నిరంతరకృషి' అని వినపడుతుంది. ఈరేడియో యేదో నవయువక యోధుల్ని తయారుచేస్తోందంటారు అడపా రామకృష్ణారావుగారు. వారెక్కడ దాక్కున్నారో కనపడరు. కట్నాలు బేరమాడే వారూ, రేడియో చుట్టూ ఆశ్రయించేవారూ, సినిమాలో పావమాన్చడానికి కడకళ్ళపడేవారూ, ఎట్లాగైనా డబ్బు, కొందరికి వుండనీ అందరూ పంచుకోనీ, విరివిగా డబ్బు అదే నవయుగమైతే స్పష్టంగా కనపడుతోంది. డబ్బుకోసం చాలా త్యాగం జరుగుతోంది ప్రపంచంలో. బ్రిటిష్ వారి నుంచి స్వతంత్రమంటే చాలామందికి డబ్బు యెక్కువ నిలవ కావడమని అర్థం.

ఏ త్యాగాలవల్లనయినా సరే, ఎప్పుడో త్యాగాలు అవసరం లేని ప్రపంచం, బాధలూ, తగాదాలూ లేని లోకం రాబోతోందని ఆశలుపెట్టడం చాలా మోసం, వొస్తుందేమో? కాని, వొస్తుందని నిశ్చయంగా చెప్పినమనిషి మోసం చేస్తున్నాడు వినేవాళ్ళని. చాలా అనుమానమైన ఈ ఆశ కోసం ఈనాడు యువకుల్ని కాలత్యాగం, యుద్ధాలకి ప్రాణత్యాగం, బీదల కోసం ధనత్యాగం, ఆదాయం కోసం ఆకలిత్యాగం యిట్లా యెన్నో.

హిందూ విజ్ఞానంలో లేదు ప్రపంచం నిరంతరాభివృద్ధి పొందుతోందని. వాళ్ళది కాలచక్రం. పాశ్చాత్యుల సైన్సు ఫలితం యీ అభిప్రాయం

ప్రపంచం యేదో ఆదర్శంవైపు నడుస్తోందనడం, 'ఇదుగో అదుగో వొస్తోంది' అనుకోడం, అందువల్ల నే యీ దేశంలో విజ్ఞానంకోసంత్యాగం తక్కువ. అసలు సుఖంగా బతికే జాతిలో త్యాగం చాలా అనవసరం. ముందువాళ్ళు వాళ్ళసంగతి చూసుకుంటారు. ఈనాడు సుఖమైన, సంపూర్ణమైన జీవితం యెట్లా గడపాలా అనేదే ముఖ్యమైన విషయం.

ఈ త్యాగబోధన చాలా అనర్థాలకి హేతువు. పూర్వంత్యాగం చేసేవారు పురాణాల్లో. కాని, దానిని త్యాగమనేవాళ్ళుకాదు, శ్రీరాముడు అడివికి పోతే ధర్మమన్నారు గాని, త్యాగమనలేదు. శ్రీ జీవితమూ అంతే. సీత తానేమీ త్యాగం చేసిందనుకోలేదు. కష్టంవొస్తే యేడ్చారు, సుఖం వొస్తే నవ్వారు. గొప్పకబుర్లు చెప్పలేదు. ముందు యుగాల వాళ్ళకోసం త్యాగమనలేదు.

పూర్వం యెవరూ ఏ సత్యం కోసం, మతికోసం త్యాగాలు చెయ్యలేదు యీ దేశంలో. మొత్తానికి చాలా స్వల్పం. 'నేను చెప్పేది సత్యం కాదంటావా? పోనీలే, నీకు నచ్చితే వొప్పుకో' అన్న విధంగా వుండేది. సత్యాన్వేషణ. జీవితపు పొంగు, ఆనందం, ఎవరూ దాన్ని అంగీకరించక్కర్లేదు. తనదే సత్యమని యెవరూ గట్టిగా నమ్మినట్టు కనపడదు. అధర్మాలూ, అన్యాయాలూ వుంటే వాటిని తీసెయ్యటానికి ప్రయత్నించేవారుకాని. సమస్తమూ నాశనం చేసుకుని కాదు బుద్ధుడు యిల్లువొదిలిపోతే అతనుగానీ, ఇంకెవరుగాని అది త్యాగమనలేదు. నోరి వెంకటేశ్వర్లమల్లే 'అదో వెర్రి, అది వాడికి విలాసము' అన్నారు ఆనాడు. ఈనాడు మనం ఓహో ఎంత త్యాగం! అంటాం.

మనకు కనపడే యీ మానవ జీవితంలోంచి కొన్ని సూత్రాల్ని, అర్థాల్ని లాగడానికి చేసే ప్రయత్నంవల్ల వొచ్చింది ఈ ఘోరం,



పూర్వులూ సూత్రాల్ని లాగారు. కాని, వాటిని జీవితానుష్ఠానంలోకి తీసుకురావడానికి గట్టి ప్రయత్నాలు చెయ్యలేదు. సైన్సు అంటే కనబడేవాంట్లోంచి సూత్రాల్ని లాగడం. పశ్చిమ దేశాల్లో సైన్సు సైన్సుగా వుండకుండా, మనుషుల మనసుల్ని, నమ్మకాల్ని మతాల్ని, రాజ్యాంగ విధానాన్ని పరిపాలించడానికి పూనుకుంది.

మార్క్స్ పూర్వపు ఇండియాలో పుట్టి. జీవితమంటే అర్థం ఆర్థిక సంఘర్షణ అని వ్యాఖ్యానం చేస్తే. 'ఓహో అట్లా అనుకుంటున్నావా!' అనీ, 'కాదు, కాదని నిన్ను తర్కంవల్ల వోడిస్తా'మనీ అనేవాడు. కాని, అతని మాటల్ని నమ్మి ముందుయుగాల వారికోసం యెవరూ ప్రాణాల్నీ సుఖాల్నీ వొదులుకునేవారు కారు. ఇండియాలో గాని, చైనాలోగాని, ఇంకా కాకపోతే 'ధనమూల మిదంజగత్'అని చాలాకాలం కిందటే చెప్పారోయ్. ఈనాడు నువ్వు కొత్తగాచెప్పేదేముంది? అని దులిపేసుకునేవాళ్ళు. అందువల్ల నే మన దేశంలో ఎప్పుడూ థాట్ కి సంపూర్ణమైన స్వేచ్ఛ వుండేది. ఆ థాట్ ని సంఘంమీదికి తెచ్చి, ఉన్న వ్యవస్థని మార్చడానికీ, కూలద్రొయ్యడానికీ ప్రయత్నించినప్పుడే తగాదా వొచ్చేది.

జీవితానికి అవసరమైన సైన్సు రిచర్చి లేకుండానే తెలిసేది. మనుషులకి బీరకాయల్లో విటమిన్సు వున్నాయని తెలియకుండానే తినేవారు బీరకాయల్ని. బీరకాయల్ని ప్రజలచేత ముందుతరంవారిచేత తినిపించడానికి ఏ ఉపన్యాసాలూ, ప్రయత్నాలూ లేనేలేవు. త్యాగమనేది త్యాగమని తెలియకుండానే జరగాలి. తెలిసి జరిగినప్పుడు తనకీ, ఇతరులకీ విషతుల్యం.

భూమిచుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడనీ, సూర్యుడుచుట్టూ భూమి తిరుగుతోందనీ, ఈ వాదనలకోసం కొన్ని శతాబ్దాలు కొట్టుకొని చచ్చి ఆ సత్యాలకోసం త్యాగాలు జరిగిం తరువాత, ఈనాడు ఒకటి ఎంత నిజమో రెండోదీ అంతే నిజం అని రూఢిచేశారు. ఆనాడు కొట్టుకొని నరుక్కున్న వాళ్ళందరూ ఓకోట నుంచుని ఉంటే వాళ్ళ మొహాలు ఓసారి చూడాలని

పిస్తుంది. తరచగా తరచగా ఏదన్నా వొకటేనని అన్ని విషయాలకీ చివరి సత్యం అదేనేమో అనిపిస్తుంది.

ఏ వెఱ్ఱి ప్రయత్నాలూ, విప్లవాలూ, త్యాగాలూ లేకుండా, వెనక యుగాలవాళ్ళకి వెనక యుగం వాళ్ళనివొదిలి, ముందు యుగాల వాళ్ళని ముందు యుగాలకి వొదిలి, యీ మానవజాతిని ఏదో సుఖపెట్టే భావాన్ని, మన భుజాలమీదనుంచి దించుకొని ఈ నిముషాన మన సుఖమేదో అది కొంచెం గట్టిగా యోచించడం బుద్ధిమంతతనమనిపిస్తోంది. మాటలేగాని జరుగుతున్న పని అంతేనేమో! ఏ పదిమంది మూర్ఖులోతప్ప తక్కిన వాళ్ళు ఇతరులని మోసగించడానికి ముందు యుగాల ఉపన్యాసాలిస్తో తాము సుఖపడుతోనే వున్నారు.

జ్ఞానం సంపాదించడంవల్ల శాంతి చెడదు. సంపాయించిన జ్ఞానాన్ని విశ్వసించి దాన్ని జీవితంమీదికి తెచ్చుకొని ఆ జ్ఞానం ప్రకారం జీవితాన్ని వంకర తిప్పడంవల్ల కలుగుతాయి అనర్థాలు. 'నీడ్షే' జెర్మనీలో చెప్పిన వేదాంతంవల్ల జర్మనీ ప్రజలు స్వభావాలే మారి యుద్ధాలూ! దేవుడు లేడు. పాపం పుణ్యం లేవని చెప్పే వేదాంతంతో అన్ని నమ్మకాలూ, ధర్మాలూ నశించి, ప్రజలు ధన సుఖాపేక్షపరులై వీలైనంత విధ్వంసకానికి పూనడమూ? ఫ్రాయిడ్ జీవిత శక్తి. 'సెక్సు' అంటే దాని ప్రకారం స్త్రీ పురుషుల సంబంధాన్ని నిర్ణయించుకోడమూ?-అందువల్లనే ఆ స్తిమితం.

ఏ జ్ఞానమైనాసరే అది రిలెటివ్. ఓ మూలనుంచి ఓ కోణంనించే అది సత్యం. సంపూర్ణమైన జ్ఞానం ఏదీకాదు, నీకు సత్యం కనక అది నాకు సత్యం కానక్కరలేదు, అనే స్తిమితం విశాలత్వం ఇంకా వుంది ఈ దేశంలో. అందువల్లనే చలాన్ని యింత హాయిగా బతకనిచ్చారు. ఎంత కోపించినా ఇబ్బందిపడ్డా, 'అదోరకం కానీ, అట్లా కనపడుతోంది గావును అతనికి. అది నిజమే,' అని సరదాగా నవ్వి భుజంమీద తట్టి ఎవరి పని వారు చూసుకున్నారు, అదే సత్యమని నమ్మే చలంబోటివాడికి ఈ అ



పత్రా నిర్లక్ష్యం ప్రాణాంతకమై ఇంకా చీలుస్తో అరుస్తాడు. వాళ్లు మంది నిలేసి అడుగుతాడు. 'నువ్వు చెప్పేది నిజం కాదనటంలేదే? కాని లోకంలో నువ్వు వొక్కడివే కాదు బుద్ధిమంతుడివి. మేము చెప్పేదాంటోనూ నిజం ఉంది' అంటారు అందరూ.

'పరస్పర విరుద్ధాలు రెంటిలోనూ నిజం ఎట్లా ఉంటుంది? తర్కానికే అంటే విరోధం అది.'

'కాని జీవితం తర్కంకన్న చాలా విశాలం' అని జవాబు.

ప్రపంచం నిరంతరాభివృద్ధి పొందుతోందనే నమ్మకంవల్ల ఆ అభివృద్ధికోసం ఎంత త్యాగం వల్లనైనా పాటు పడాలనే ప్రయత్నం కలుగుతుంది, ఉదారులైన మానవుల్లో.

'ఏదో ఇట్లాంటి చిత్రం జరుగుతోంది. దీనికో అంతం అర్థంలేవు. ఉంటే అది తెలీదు.' అనుకుంటే సుఖమూ విశ్రాంతీ వొస్తాయి జీవితానికి.

ఒక్కొక్క సాంఘిక రాజకీయ పద్ధతి స్థాపించడానికి త్యాగాలూ, ధ్వంసాలూ కొన్నాళ్ళయిం తరువాత ఇంకో కొత్తది సత్యమని తోచగానే, ఆ పాతదాన్ని నిర్మూలించి కొత్తదాన్ని స్థాపించడానికి మళ్ళీ నాశనం.

ఈ ప్రపంచం నిరంతరాభివృద్ధిలో నమ్మకం, పరిణామవాదంవల్ల కలిగింది అంటాడు బెట్రండ్ రస్సెల్. నెబ్యులానించి యీ గోళాలు సూర్యకుటుంబం, భూమి, భూమిమీద జీవులు ఒకదాంటోంచి ఒకటి కొత్త స్వరూపాలు, చివరికి మానవుడు అడివి మనిషినించి పరిణామం చెందిన మానవుడిలో జ్ఞానమూ, నీతీ. మేధాబలం యీ విధంగా ఈనాటికి అభివృద్ధి చెందింది గనక ఇంక ముందుకూడా ఏదో శాంతిలోకే సమత్వంలోకే అభివృద్ధి వుందని. కాని సృష్టి మానవుడి ఆశలతోవనే తాను ముందుకాలంలో నడపతలచుకుంది అనడానికి ఆధారం ఏమీ లేదు. ఈ అభివృద్ధినంతా

భావించుకుంటోంది మానవుడి మనసేకాని ఇంకేంలేదు. బెర్నార్డుషా చెప్పినట్టు ప్లేటోకాలంతో పోల్చిచూస్తే ఈనాడు ఏమీ గొప్ప విజ్ఞానం కనబడదు, మన దేశంలో ఋషులకాలంతో పోల్చి చూసుకున్నా అదే కనబడుతుంది, ఆనాటి విశాలత్వం, ధర్మంమీది పట్టు జంకకండా విజ్ఞానాన్ని అన్వేషించే శక్తి,ఆనాటినించి మళ్ళీ ఎప్పుడూ కనపడలేదు. పరపరిపాలనే లేకపోతేనా. ఎన్ని సాధించగలం అని కలలుకన్న ప్రజలు ఈనాడు ఏవిధంగా ముందుకి సాగుతున్నారు? ఏ నేషనలిజం, ఏ మెటీరియలిజం అనర్థమని మనదేశాన్ని వాటినించి కాపాడాలని టాగూర్, గాంధీ ప్రయత్నించారో అటువేపే నడుస్తున్నాం, అతివేగంగా. మాటల్లో తప్ప ధర్మం, శాంతీ, నూతన కాంతీ, ఎక్కడాలేవు. కొత్తపేర్లు పెట్టుకొని కొందరం అమెరికా అడుగుజాడల్లో కొందరం రష్యా తొక్కిన మార్గంలో పరిగెత్తుతున్నాం.

